

శ్రీ ర స్తు.

# ఆనందరంగరాట్ఛందము.

---

పీ ఠి క.




వక్షస్స్థలి ముద్దుగుల్కుచును ధాత్రీదేవి లీలాసతుల్
ఠీవిం గ్రేవల నొప్ప నిర్జరవధూటీకోటి సద్భక్తిచే
సేవల్సేయఁగ హర్షరీతిఁ గొలువై చెల్వొందు లోకేశ్వరుం
డావిష్ణుం డొగిఁ బ్రోచుఁ గాత దయతో నానందరంగాధిపున్. 1

ఉ. తెల్లనికొండ యిల్లుగను దెల్లనిగిబ్బరౌతు వారువంబుగాఁ
దెల్లనిరేకుఁ దాల్చికొని తెల్లనిమిన్కులవానిఁ బువ్వుగాఁ
దెల్లనిత్రాఁచు సొమ్ముగను దెల్లమిగాఁ గయికొన్నయట్టి యా
తెల్లనిసామి రంగనృపధీమణికీర్తులఁ గీర్తిసంపదల్. 2

చ. మదియను వారిలోనఁ గడుముఖ్యుఁడు ముందటిజాతి యేఁడు ప్రాఁ
జదువులకాణయాచి పజసామి తనంతనె కల్గుమేటి నె
న్నదుటను వ్రాయుసంప్రతి కను ల్దగ చౌకము గల్గుపేల్ప స
మ్మదమున రంగభూపతికిఁ బూర్ణతరాయు వొసంగుఁ గావుతన్. 3

సీ. ఘనమహాపద్మవైఖరి నంఘ్రులు వహింపఁ గచ్ఛపమహిమ మీఁగాళ్లు గాంచ
మకరసంపదను పేమలు జంఘ లింపొంద శంఖరీతి గళంబు సరవిఁ జెందఁ
బద్మరాగప్రౌఢిఁ బాణిద్వయము గేరఁ గుందవిస్ఫూర్తిఁ బల్కుదుఱు మీఱ
నిందీవరోన్నతి వీక్షణంబు లడల్ప నీలవైభవముఁ బెన్నెఱులు దాల్ప

తే. నా ముకుందవక్షస్స్థలి నమరులక్ష్మి, ప్రకటమతియావజారతరాయవిజయ
రంగ నానందరంగధరావిభునకుఁ, జెలఁగు నవనిధు లిచ్చి రక్షించుఁ గాత! 4

సీ. బలుఁ తావి సుధ దీవి వలె కీవి గలమోవి పై దంతకాంతులు పరిఢవిల్ల
మను గప్పు మవిచొప్పునను మెప్పు గలకొప్పు నవలకుఁ బుట్టిల్లుగను జెలంగ
సితధాముఁ డగుసోమగతి గోము గలమోము వను నవ్వు వెన్నెల లెసఁగి కాయ
మరుతూపులను బాపు నెఱవైపు గలచూపులందు దయాదృష్టి చిందుచుండ

తే. నీపరాశక్తికన్న వేఱొకరు మిన్న, గన్నవేలు పని విపన్నగణము లెన్న
హరుని సామేనఁ గైకొన్న యయ్యపర్ణ, పూని యానందరంగేంద్రుఁ బ్రోచుఁగాత!

సీ. నాలుకపై నటనము సేయుగజయాన పుస్తకరూప మై పొసఁగుచాన
భజన చేసినవారి పాలికల్పకవల్లి యన్నిబాసలు తాన యైనతల్లి
మూఢునైనను జగత్పూజ్యుఁ జేయునధూటి యఖిలవర్ణాత్మిక యైనబోటి
నిస్తులశోణమాణిక్యవీణాపాణి మత్తవనప్రియమంజువాణి
తే. వాణి శ్రీనందగోపాలవంశజలధి, రాజతిరువేంగళేంద్రగర్భప్రశస్త
నవ్యమౌక్తిక మైనయానందరంగ, నృపమనోంబుజమున నెప్డు నిలుచుఁ గాత! 6

తే. ఆనయమును దాను గజముఖుఁ డయ్యుఁ దండ్రి యైనపంచాస్యుచేఁ బూజ లందినట్టి
గణపతి సమగ్రభోగభాగ్యంబు లొసఁగుఁ, గాత యానందరంగభూకాంతునకును.

వ. అని ప్రార్థించి. 8

సీ. ఆదిమసుకవి భీమనకు దండము వెట్టి యన్నయభట్టుకు నర్థి మ్రొక్కి
యమరఁ దిక్కనసోమయాజికిఁ గేల్మోడ్చి కవిరాక్షసునకుఁ జోకఁ బ్రణమిల్లి
అలసాని పెద్దన కంజలి గావించి శ్రీనాథునకు రెండుచేతు లెత్తి
రంగనాథునకు సాష్టాంగంబు గావించి యలభాస్కరునికిఁ జోహారు చేసి
తే. బాణ భవభూతి భారవి భాస కాళి,దాస దండి మయూరా ద్యుదారసుకవి
రాజిరాజత్పదాబ్జపరాగ మెలమి, మస్తకస్థలి ధరియింతు మహితభక్తి. 9

ఆ. వాణి వేణిరీతి వన్నెగా మిన్నగాఁ, గలిగుఁ గూర్చు కవిత కవిత గాక
కసువ...నట్లు పస లేనికవితయుఁ, బలుకఁ గవిత యగునె పవిది గాక. 10

ఉ. ఒప్పను దప్పు లేనికృతి యుగ్మలి........తియొప్పుచుక్
దప్పను రెండు గల్గుకృతి దక్కఁగ హీనపు నాతిజాతి యే
తప్పును లేక యొప్పగను దార్కొనుసత్కృతి రూపరేఖలన్
జొప్పడు ప్రౌఢ యౌవనసుందరరీతిగ దా తలంపఁగన్. 11

వ. అని యిష్టదేవతానమస్కారంబును సుకవిపురస్కారంబును గుకవితిరస్కారం
బును గావించి యొద్దియేనియు నొక్కదివ్యప్రబంధంబు నిబంధింపఁ దలంచు
నవసరంబున. 12

సీ. తనయుక్తి తనభక్తి తామరసాసను నతనితనూభవు నపహసింపఁ
దనకీర్తి తనమూర్తి దైత్యకులాంతకు నతనితనూభవు నటమరి(టి)ంపఁ
దనకల్మి తనబల్మి దాక్షాయణీభర్త నతనితనూభవు ననువుఁ గాంచఁ
దనవైపుఁ దనయేపు ధారాధరతురంగు నతనితనూభవుఁ బ్రతిఘ మించ

తే. ధరణి ప్రాంసుమహారాజదత్తమత్త, కరటిఘటఘోటకభటాదిఘనవిభూతి
ప్రబల శ్రీమద్వ్రజారతిరాయవిజయ, లాంఛనానందరంగధరావరుండు.

సీ. అమితవిక్రములైనహూణరాజు లొకచోట నొకచోట మత్తరాహుత్తతతి
సరిలేక మిత్రమీఅంసరదారు లొకచోట నొకచోట రాయబారికసమాజ
మమరఁ గుంపినిపత్రికావళి యొకచోట నొకచోటఁ దక్కునుద్యోగిజనము
ఘనధరామండలాఖండలు లొకచోట నొకచోట రాయనియోగిచయము

తే. లొకట శాబ్దికతార్కికసుకవిరాజ, వందిమాగధగాయకవైణికభట
నటవిటులుఁ గొల్వఁగాసమున్నతవిభూతి, రమణఁగొల్వుండెనానందరంగవిభుఁడు. 14

వ. వెండియును సముద్దండభుజాదండమండలాగ్రఖండితారిభూమండలాఖండలకుండా
లకాండనరూధినీమండలుండును, మండలీకృతకోదండ ముక్తచండకాండదండి
తాభియాతిసమూహ ఢిల్లీశ్వరప్రముఖరాజన్యమూర్ధన్యమస్తక నిస్తుల కోటీరకోటీ
రచితశోణమణి శ్రేణీవిరాజిత పదరాజీవ ప్రాంసుమహారాజేంద్ర హృదయాను
గతచర తక్కుంపినీప్రభువర్య సర్వకార్యనిర్వాహణచణ మనీషావిశేషుండును,
శేషశయనచరణారవిందమకరంద తుందిలేందిందిరాయమాణ మా న స క ఢా భి
(కిడాంబి) శ్రీనివాసాచార్యవర్యపదభక్తివైభవుండును, భవనాంతరప్రవర్ధమాన
సామ్రాజ్యలక్ష్మీవిలాసభాసురుండును, సురధేను మందాకినీ మందార కుందార
విందారి బృందారకాహారహీరడిండీర తుషారక్షీరపారావారవారణాహిత సితఘ
నాఘన ఘనసారనారదపారదశారదాశరధరదరపురప్రహరగిరిపులినమరాళ హరి
దంతకరిదంతనితాంత కాంతియశస్సమాక్రాంత భూనభోంతరుండును, తరతమ
ప్రజ్ఞావిచక్షణుండును, క్షణక్షణప్రవర్ధితోత్సాహబాహుళ్యుండును నగుచు నిగ
నిగమను మగఱాలనిగరాలజిగి చాలఁజాలుకొను జాళువారుటంపు బోదియలప్రోది
యల మించుపగడాలజగడాలకంబంబులు డంబుమీఱి విడంబించునీరాజచందువుల
సందంబై చెలువొందిన నిండుసరిగెబనాతిపనివార్వ్యజాలరులకు జాలుకొని క్రొత్త
ముత్తియపుగుంపుల నింపఁజాలుతివాసులరత్నపు జతపంబుల మించు జలతారు
బారిమెఱుఁగుదిండ్లు బటువుబిల్లలు నల్లనిల్లుకొల్వుకూటంబున సుఖాసీనుండై
సకలరాజాధిరాజపరివృతుండగుపట్టాభిరామమూర్తి తెఱంగున నిఖిలయాదవసమ
న్వితుండైనకృష్ణదేవుని రీతిని సమస్తబృందారకసంసేవితుండైనదేవేంద్రుని చందం
బున నపారతారకాగణమధ్యభాసమానుండగుపూర్ణచంద్రుని యోజం దే
నొకయెడ జితామిత్రు లగుమిత్రులును, నొకచెంతఁ బురోహితులున్ శిష్టవిద్వాం
సులును, నొకచాయ గాయకులగు గాయకులును నొకదండఁ బండితులు నుండు మృగయా
నొకయోర నర్థులగు నర్థులును వెలయ నొకక్రేవ నిజకీర్తిప్రతాపంబున. 30

త్మకదివ్యప్రబంధంబుల వందిబృందంబు కైవారంబు సేయ నొక్కచో భరతశాస్త్ర ప్రవీణ లగు గణికామణికాగణంబులు స్వాభావరీతి సభారమ్యంబుగ నృత్యగీతవాద్యాభినయంబు లభినయంబు గా మెరయింప నొక్కచక్కి రాయసము లగు రాయసములును, నొక్కవంకఁ బ్రవర్తక లగు త్రివర్తకులును, నొక్కచోట, నిష్కపటవంతు లగు నిష్కపటవంతులును, నొక్కప్రాంత మహాదాశుచిత్ర విస్తారశ్లేషావిశేషాధిక సాహిత్యంబులు కవిరాజులు ప్రకటింప నొక్కయిక్కఁ బరమపావన రామాయణ భారత భాగవతాష్టాదశపురాణేతిహాస ప్రసంగ నిగూఢార్థ తత్పరతా వాద ప్రతివాదంబులు సేయు శాస్త్రజ్ఞు లెసంగ నొక్కదాపున బహువిధ సమర నిపుణతా సహోత్సాహ శూరవజీర సందోహంబును, నొక్కచెంగట నప్పాజి భట్టి యుగంధరాదిమంత్రి మూర్ధన్యప్రతిమాన మనీషా విభవాప్రతిమాన మానభాసమాను లగు నమాత్యశేఖరులును, నొక్క దిక్కున నటవిటభట పరిహాసిక వైణిక వైతాళిక ప్రముఖ పరివారంబును యథాస్థానంబులం బరివేష్టించి కొలువ భూలోకదేవేంద్రుని చందంబున వైభవోన్నతుండై పేరోలగంబునఁ గొలువుండి. 15

మ. ఘను శ్రీసాంబపదాబ్జసేవకు నపర్ణాపూర్ణ కారుణ్యభా
జనసంశీలుఁ జతుర్విధాంధ్రకవితాసల్లక్షణగ్రంథ శో
ధనధీసంయుతు భావగర్భపదపద్యాళిప్రబంధానుబం
ధను నిన్ గస్తురిరంగసత్కవిని జెంతం బిల్చి సెయ్యంబునన్. 16

మ. కవితాధోరణి నెన్న నీవలె సమగ్రఖ్యాతి గైకొన్న వా
రవనిం బ్రౌఢు లనేకు లొప్పెదరు వారల్లోన దున్నన్ భవ
త్కవితల్ భద్రకరంబు లయ్యె నదిగాకన్ మాకుఁ బట్టంపుస
త్కవి వీవైతివి గావునన్ బుధమణీ కస్తూరిరంగాగ్రణీ! 17

క. అబ్బురముగ నీచే నొక, కబ్బము గావించి దానిఁ గైకొని కీర్తుల్
జొబ్బిల నందఱితో నను, గబ్బిగఁ బొడన మొనర్తుఁ గడు ముద మొదవన్. 18

తే. సప్తసంతానములను శాశ్వతయశంబు, దనరఁ జేయును సత్ప్రబంధంబు గాన
గరిమతో నొకలక్షణగ్రంథమును మ్మదంకితమ్ముగ రచియింపు మనుచుఁ బలికె. 19

వ. సగౌరవంబుగా సన్మానించి పనిచిన నమందానందంబు డెందంబున సందడింప మందిరంబునఁ జేరి మదంతరంగంబున. 20

సీ. జనయశోపకారముగ నన్నునవమాగ నా పేర లక్షణగ్రంథమునన్ (మనన్)
దనకీర్తి తనివినుంచుఁ బలుకుట, సవరణ నేఁ జేయు సుకృతసారము గాదె! 21
దనకల్మి తనబల్మి సుకవిభీమన ప్రభృతులు గావించిన దశవిధచ్ఛందంబులు, లక్షణకావ్యం
దనవైపుఁ దనరొప్పంచి యందునఁ గలసారం బంతయు లక్షణంబుగాఁ గైకొని కాళి

దాసాదిగీర్వాణకవులు నన్నయభట్టప్రముఖాంధ్రకవులు గావించిన మహాకావ్యం
బులందు లక్ష్యంబులు వివరించి సకలకవిసమ్మతంబుగా నానందరంగచ్ఛందం బను
లక్షణగ్రంథంబు విస్తరించెద 22

తే. వనలతోఁ గూడి వాసించు నారరీతి, శంఖమునఁ గూడి తీర్థ మౌజలము భాతిఁ
బూర్వసుకవీంద్ర సాహిత్యములను గలసి, నేను రచియించుసాహితి నెగడకున్నె? 23

వ. అని యిం తిం తనరానిసంతసంబున వజారతరాయవిజయానందరంగరాయచక్రవర్తి
పేర నంకితంబుగ ఛందంబుఁ బొందింప నుద్యుక్తుండ నగుటంజేసి తత్కృతిపతి
వంశావతారం బభివర్ణించెద. 24

సీ. ఏదేవదేవునిపాదపరాగంబు శిరసావహించు నిర్జరసమూహ
మేమహామహుదివ్యనామకీర్తనములు భజనగావింతురు పరమహాను
లేస్వామిశుభమూర్తి వీక్షింప మదిఁ గోరి కమలజప్రముఖులు నెమకుచుందు
రేదయానిధియపాంగేక్షణం బాశించి వ్యాసాదిసద్భక్తు లాశ్రయింతు

తే. రట్టిపురుషోత్తమునిఁ బరమాత్ముఁ డైన, కృష్ణదేవుని సుతునిఁగాఁ బ్రేమఁ బడసి
బలిమిఁ గలిమిని మించి వేపల్లెనుండు, నందుఁ డొకనాఁడు సంతతానందుఁడగుచు.

సీ. శ్రీకృష్ణమూర్తి నీక్షించి మించినభక్తిఁ "బరమాత్మ జగదీశ భక్తవరద
నీ విట్లు వసుదేవదేవకీదేవులకడుపునఁ బుట్టి నాకొడుక వనఁగ
నమరి సమస్తలోకములను సత్కీర్తి యొనరఁ జేసితివి యింకొక్కమనవి
యున్నది నీవు సమున్నతప్రేమ మద్వంశంబున జనింపవలయు" ననుచు

తే. వెలమిఁ బ్రార్థింప నట్టులే కలియుగమున, నవతరించెద నని చాల నాదరించి
నందుఁ డుల్లంబు పల్లవిల్ల, నల్ల వేపల్లె శ్రీ లుల్లసిల్ల వెలసె. 26

బు భువన, ఖ్యాతభుజాబలవినిర్జితారాతిధరి
లు కొందఱు, నూతనరాజ్యపరిపాలనోత్సుకు లగుచున్. 37

మకు విభాగసంప్రాప్త మగుచు, నెగడుమంజీరవాణీమణీతటాక
జోత్తమాంగంబు లనుపురత్రయమును నేలుచు నుండిరి హర్షమునను. 28

గ్రవంశజుఁడు గో, విందనృపతి యయనపురము నేలుచు శ్రీ
లంది యశంబొంది విజయ, నందనుఁ డను పేర వెలయునందనుఁ బడసెన్. 29

వ. ఇట్లు వడసిన యాకుమారశిఖాముఖుఁడు దినదిన ప్రవర్ధమానుండై, చతుష్షష్టివిద్యా
విశారదుండై సకలశుభలక్షణలక్షితుఁడయి తేజరిల్లుచు నొక్కనాఁడు మృగయా
వినోదంబుగా వనాంతరంబునకుం జని యచ్చట విహరించుసమయంబున. 30

సీ. ఘనుఁడు విద్యారణ్యుఁ డనుపుణ్యపురుషుండు, బహుళతరైశ్వర్యపదవిఁ గోరి
పరదేవతోపాస్తి బహుకాల మొనరింప, నయ్యంబ ప్రత్యక్షమగుచు నీదు
కోర్కె లీడేర్తు నింకొకజన్మమున కంచుఁ, బలికిన వ్యాసులపాటుఁ జెంది
సన్న్యసించినను దక్షిణమున నాదేవి, సాన్నిధ్యమై మహైశ్వర్యసమితి
తే. బలిమి నొసఁగినఁ జింతించి తెలివిఁ గాంచి, విజయనగరాఖ్యపురము గావించి మించి
దీనిఁ బాలించుటకు యోగ్యుఁ డైనమేటి, యెవ్వఁడో యనియాత్మలో నెంచుచుండ.

తే. ఆమహారణ్యసీమ వేఁటాడువిజయ, నందనునిఁ జూచి యతని నానగరమునకు
శ్రీకరంబుగఁ బట్టాభిషిక్తుఁ జేసి, విజయనందనరాయ లన్పే రొసంగె. 32

చ. అతఁడు సమస్తభూమివలయం బనవద్యవిశేషనీతిప
ద్ధతిఁ దగ నేలుచుం గుటిలదర్పవిరోధివరూధినీహిమ
ప్రతతిసహస్రభానుఁ డనఁ బ్రస్తుతికెక్కె మనోజ్ఞభాషియై
శ్రితజనపోషియై ప్రజలఁ జేకొని ప్రోచెను ఎన్నివాసిగన్. 33

సీ. ఆమహామహునకు రామచంద్రాఖ్యరాయలు పుట్టె నతనికి నెంచ (యంబ) దేవ
రాయ లావిభునకు రాజశేఖరరాయ లానరేంద్రునకు గోళనరసింహ
రాయ లతనికి శ్రీరామచంద్రేశుఁ డాఘనునకు లాంగూళగజపతీంద్రుఁ
డతనికి గరుడమహాదేవరాయ లాధీరున కచ్యుతదేవరాయ
తే. లాయనకు వీరనరసింహరాయనృపతి, చంద్రు లుదయించి రందఱు ఛత్రపతులు
చక్రవర్తులునై ధరాచక్ర మేలి, పేరుఁ గాంచిరి ప్రజలు మేల్మే లనంగ. 34

సీ. ఆవీరనరసింహభూవరుపట్టంపురాణి లక్ష్మమయందు రామదేవ
రాయలు తిరుమలరాయలు శ్రీరంగరాయ వేంకటపతిరాయఘనులు
హేమంతరాయ లీరేవురు పుట్టిరి యడపకత్తెనదీపాలి యందుఁ
గృష్ణరాయలు పుట్టి కీర్తిగా నప్పాజి యనుమంత్రిఁ గూడి రాజ్యంబుఁ జేసె
తే. యశము రెట్టింప బంధువు లనుమతింపఁ, దొలుతఁ జెప్పినయేవురుదొరలు కొంత
సీమ కధిపతులై రందు రామదేవ, నృపతిమణి చంద్రగిరిదుర్గ మేలుచుండె. 35

క. ఆరామదేవరాయధ, రారమణునకున్ దివాకరసమద్యుతియై
మీఱి కళాధరుఁ డనెడుకుమారుఁడు జనియించె వంశమండనుఁ డగుచున్. 36

చ. లలితగుణాభిరాముఁ డకలంకయశోవిభవుండు సింహస
ద్బలుఁడు కళాధరుండు తమతాతలనాఁటిమిరాశియై సము
జ్జ్వలబలరాశియో యనఁగఁ బట్టణరాజ్యముఁ జేరి యచ్చటం
జెలువుగ రాజ్యపాలనము సేయుచునుండె ననేకవర్షముల్. 37

క. నెఱయొంధ తదీయకళా,ధరునకుఁ గొమ్మదికి గర్భదారకుఁ డనఁగా
వరపుత్రుఁ డొకఁడు పుట్టెను, గరికలభమతిని బలవిలాస ప్రౌఢిన్. 38

వ. అతఁడు దినదినప్రవర్ధమానుం డై నిఖిలవిద్యానిధానుం డై వదాన్యగుణవిభాసమానుం డై యయ్యనవనగరము పాలించుచుండెఁ దదీయకీర్తి నిఖిలదేశంబుల నిండి మెండుకొనినం జూచి కుతుకుంబు మొదలుగాఁ గలకవిదిగ్గజంబు లెనమండ్రు గోలకొండనుండి వెలువడి యాగర్భదారకనృపాలుని రాజధాని యైన యయ్యనపురంబుఁ జేరి నగరివాకిట వచ్చు నెవ నంచు వడ్లకణజంబు ముందఱఁ జిందియున్న ధాన్యం బీక్షించు నేర్పరియే గర్భదారకుం డని యచ్చటివారలచే నెఱింగి యిట్టివాఁడు మన కేమి త్యాగమీయఁబోయెడి నెందుకు వచ్చితిమని మంతనంబునం గొంతచింతించి యంతలో నిసుమంత దిటవు దెచ్చుకొని యతనిచెంతం జేరి యాశీర్వదించిన రాజన్యమూర్ధన్యుండు వారియంతరంగం బెఱింగి చిఱునవ్వు నవ్వుచు యవ్విద్వన్నికరంబును దనయంతఃపురంబునకుం దోడ్కొని పోయి రంగలరారు బంగారుపళ్లెంబులఁ జిరత్నంబు లగు నవరత్నంబు లుంచి వేయువేల వడ్డించి భుజియింపుఁ డని యుపచరించిన నయ్యర్థు లతనిసమర్థతకు హెచ్చుగా మెచ్చినం జూచి యనంతరంబ షడ్రసోపేతంబుగా భోజనంబుఁ జేయించి వలయు ధనకనకవస్తువాహనభూషణాంబరంబులు బహుమతు లొసంగి యొసంగినప్రేమను వీడ్కొలిపిన వార లుప్పొంగి. 39

సీ. శిబినృపాలుఁడు ఘనశ్రీయుతుఁ డై యుండి తూఁచియిచ్చినయట్టి కోఁచదనము
వైరోచనుఁడు చక్రవర్తియై యుండియుఁ గొలిచి యిచ్చినయట్టి పలుచదనము
పుడమిలో ధారాధరుఁడు ఘనుఁ డై యుండి మొలకలు నెట్టటుయిచ్చుములుచదనము
నెరదాత యనుపేరఁ బరఁగి రాధేయుండు బదులుకు బదులిచ్చుపరుసఁదనము
తే. సారె నిందించి నీకీర్తి సన్నుతించు, వారికిని వారి...యవ్వారిగాను
ధన మొసంగెడు దాతలదాత వీవె, ప్రకటగుణశీల గర్భదారకనృపాల! 40

చ. ఇఁక నినువంటిదాత గలఁడే త్రిజగంబులలోన నెన్నఁగా
సకలగుణాభిరామ యని సారెకు సన్నుతిఁ జేసి గోలకొం
డకుఁ జని గర్భదారకుగుణాతిశయంబుల నెల్ల మేలు త
ప్పక మకరాంకభూపతికిఁ బల్కిన నాతఁడు సంతసింపుచున్. 41

తే. గర్భదారకుఁ బిలిపించి గారవించి, ఛత్రపతి యనుపేరను వేత్రపురము
కోటిరాజ్యంబు రథరథ్యకుంజరములు, సన్నుతు లొసంగి పనుప నుత్సాహలీల. 42

ఉ. వేత్రపురంబుఁ జేరి కడువేడుక మీఱఁగ దానధర్మముల్
పాత్ర మెఱింగి సేయుచు నపారయశంబును గాంచి యొంతయుం

బుత్రులుసేవి డెందమునఁ బొక్కుచు నుండెడుగర్భదారక
చ్ఛత్రపతిక్ష్మాపతికి సారసనేత్రు దయాసమగ్రతన్. 43

క. శ్రీలక్ష్మాంబయం(దలి)దును, శోలయనరనాథశౌరి సూనృతభాషా
శీలుఁడు వడమలధరణీ, పాలుఁడుఁ దిరుమలవిభుండుఁ బ్రభవించి రొగిన్. 44

వ. అందు. 45

సీ. సకలజనామోదచర్య వాక్యప్రౌఢి నేదాత యాధాత నెగ్గులాడుఁ
గమనీయరూపరేఖావిలాసస్ఫూర్తి నేభర్త శ్రీభర్త నెదురుచూచు
ననమానతరసమగ్రైశ్వర్యవిఖ్యాతి నేరాజు రారాజునే పణంచుఁ
బ్రవిమలతేజోవిభాసమానోన్నతి నేయినుం డాయినుచాయఁ దెగడు
తే. నట్టి శ్రీనందగోపవంశాబ్ధిచంద్ర, గర్భదారకవరబాలగర్భశుక్తి
మౌక్తికం బైనశోలయమహీశచంద్రు, సుగుణముల నెవ్వరికినైన నొగడవశమె.
తే. అట్టివెరయోధ యగుశోలయాధిపతికి, శ్రీమదలమేలుమంగావధూమణికిని
బొమ్మయప్రభుఁడుదయించిభోగభాగ్య, గరిమసరిమన్నెదొరలెన్న ఖ్యాతిఁగాంచె.
చ. వెలవెలఁ బోక యప్పుగొని వృద్ధిని జెందక మూలవస్తువుల్
అలిభువిఁ బాఁగుశోకను ఫలావధి నొందక ని(ల్చి)చ్చి యిచ్చి యా
కులపడకుండె నేని యొకకొంత సమం బగుఁ గల్పకం బిలన్
వెలయఁగ బొమ్మయప్రభుని విస్ఫుటదానకలావిభూతికిన్. 48

వ. అని జనులు వొగడ ఖ్యాతినిం గాంచి. 49

క. నయనమ్మయందుఁ గనిరొ, న్నయనోత్సవమొంద సుతుల నయముగఁ జెదబొ
మ్మయనరనాథుని చినబొ, మ్మయధీరునిఁ గదనశూరు నమితోదారున్. 50

సీ. ఆచిన్నబొమ్మనృపాగ్రణిగర్భాబ్ధిచంద్రుఁ డై బొమ్మయక్ష్మాధవుండు
నయనప్రభుండు కృష్ణఘనుండు వర్ధమానావనిపతి గామధీవరుండు
లక్ష్మీనృపాలలలాముం బనఁగ నిట్టిపుత్త్రి లాఋగురును బుత్త్రి నైన
మంగళావతి ఘట్టి మహీజాల వర్ధిల్లనం దగ్రజుఁడు బొమ్మయాధిపతికి
తే. జాయ యైతగురామానుజమ్మయందు, వేంగడవిభుండు శ్రీతిరువేంగడేంద్రు
డనఁగ నిద్దఱుసుతులు మంగమ్మయనెడు, తనయజనియించి కాంచిరిఘనయశంబు.

క. శ్రీవిని నావెంగడధా, త్రీవిభునకు నందనులుగఁ దిరుమలఘనుఁడున్
గోవిందనృపతి వెంగడభూవరు లుదయించి రమితభుజబలు లగుచున్. 52

తే. చతురుఁ డౌతిర్మలధరాధిపతికి వేంకటాచలన్నపాలశేఖరుం డవతరించె
మతియు గోవిందవరనాథమణికి రంగస్వామి జనియించె సుగుణాభిరాముఁ డనఁగ. 53

వ. ఇంతకు మున్ను వివరించి యున్న బొమ్మన్నపాలక రామానుజాంబికాగర్భశుక్తి ము
క్తాయమానభవ్యగాత్రుండును, సకలజనమిత్రుండును, బుధ్యాచారిత్రుండును,
నైనతిరువేంగడధరణీరమణుండు శుక్లపక్షసుధాకరునిచందంబున దినదినప్రవర్ధమా
నుండై రాజాధిరాజపూజనీయుండై తేజరిల్లుచు. 54

సీ. నీలకంధరురీతి నీలకంధరుభాతిఁ దనదానవిభవంబు ఘనతఁ గాంచ
రాజరాజును మీఱి రాజరాజును గేరి తనయైశ్వర్యంబు ఘనతఁ గాంచఁ
జిత్రభానుని గెల్చి చిత్రభాను నదల్చి తనవిక్రమోన్నతి ఘనతఁ గాంచ
హరినందనునిమించి హరినందనుహసించి తనమోహనాకృతిఘనతఁగాంచ

తే. నందగోపాలవంశరత్నాకరైకపూర్ణచంద్రాయితాంగవిస్ఫూర్తి బొమ్మ
యావనీపాలరామానుజాంబికాత్మజుఁడగుతిరువేంగడేంద్రుండు వెలయు. 55

సీ. అసురగురుండైన నాతని దెస కేగి యనుసారిగా మాటలాడఁ గలఁడె
చతురాననుండైన నతనిచమత్కృతికింతైన నుత్తరం బీయఁగలఁడె
యలబృహస్పతియైన నతని యోజనరీతి దీర్ఘదర్శితఁ గని తెలుపఁగలఁడె
యాదిశేషుండైన నతనివాగ్ధాటికిఁ బ్రతిపోటిగా నిల్చి పల్కఁగలఁడె

తే. యెంతమతియెంత చతురతయెంతయుక్తి, యెంతవాక్ప్రౌఢియని జనులెల్లఁబొగడ
నెగడెఁదిరువేంగళేంద్రుండుజగతిలోన, భూపమాత్రుఁడె యవతారమూర్తిగాక.

సీ. తీరనివ్యాజ్యము త్తీరుగఁబూనుచు యుక్తి తీరనితగవులు దీర్చుశక్తి
యెటువంటివారలైన నెంతలేదనుపద్దు ఫారిసుభాషను కథలు పల్కుముద్దు
సమయోచితముగ నీసభలఁ బల్కెడు నేర్పు హితుల నేరములు సహించునోర్పు
తనకుఁ బ్రియోక్తు లందఱుఁబల్కెదగువీఁక పురుషసింహ మనంగఁబొసఁగుడాక

తే. గాంచి యిలఁజా(ల)తిదొరల మెప్పించి మించి కవులఁదనియించి చుట్టాల గారవించి
యహితుల నణంచి దిక్కుల యశముంచి, ప్రబలు శ్రీతిరువేంగళప్రభుకిరీటి. 57

వ. ఇవ్విధంబున మహాయోగశాలియై ఫ్రాంసుహింగ్లీజాదినమార్గయోలందాయుం పరు
దొయపురతకేశు మొదలయినజాతిభాషావిశేషంబులఁ బ్రవీణతఁ గాంచి యాయా
జాతిభావరయలకుం దెలియనిగూఢార్థంబులఁ దెలియఁజేసి వారిచే మేలు మేలని
పొగడికలు గాంచి యితరమతంబుల మర్మకర్మంబులన్నియుఁ బరిశీలించి జ్ఞాననిధు
లయినసకలకలావల్లభసన్నిభులగు తోటరమల్లుప్రముఖులకు విశదపడనిభావార్థం
బుల మాటమాత్రంబున నాటలవలెఁ దేటపఱిచి బుద్ధి మూర్తీభవించినట్లు ధైర్యంబు
సాక్షాత్కరించినట్లు, చాతుర్యంబు రూపంబు గైకొన్నట్లు నీతి యాకృతిం దాల్చి
నట్లు దేజరిల్లి పరేంగితజ్ఞానంబును, దారతమ్య విమర్శనంబును ఘటనాఘటన
సామర్థ్యంబును నుచితానుచిత కార్యవివేచనంబును గలిగి యవ్యాజపరోపకార

మూర్తియై దిగంతపరివ్యాపితవిశాలకీర్తియై ప్రవర్తిల్లునమ్మహాపురుషుని ప్రభఁజూచి సైరింపఁజాలక ప్రాంసుకుంపిణి కార్యధురంధరుం డైన [1]జంద్రాలు పట్టంబునుం బూని దొరతనంబు సేయు మశియాసె జన్రాలు కొన్నికుచోద్యంబులు సేసి నానాఁట హెచ్చుగా మచ్చరించిన నాజాడ దెలిసి యేవిధంబున నైన నితని మట్టు వెట్టెదనని యెంతయుం బంతగించి సీమకు సూత్రంబులుపన్ని లక్షాంతరంబులు కర్చుచేసి విస్తారంబుగా దస్తరంబులు వ్రాయించి ప్రాంసురాజన్యున కౌజంద్రాలు దుర్వ్యాపారంబు లెఱింగించి తత్క్షణంబునం బదులుదొరను రప్పించి యాతని చేత నామశేరయే చెరను వానిఁ బట్టి కట్టించి కొట్టించి గిడ్డంగిన వేయించి తనమనంబునం గలచలం బంతయుఁ దీర్చికొని పద్దుచెల్లించితి వని యెల్లవారలుం గొనియాడఁ గుంపిని(ణి)కి ముఖ్యమంత్రియై యవతారపురుషుం డనఁదగిన మాశేను సంతతిదొర చేత మెప్పులొందుమఁ బెంపొందినంజూచి నవాబులు, సంస్థానపతులు, సాఁటివారలు వర్తకులు నాశ్చర్యంబునం బొదలి యిట్లనిరి. 58

సీ. [2]జాతికొంసేలు మేజాపల్కపైఁ గొట్టి లీల నేఘనుఁడు చెల్లించుకొనియె
సీమమట్టు ఫిరాము చేసి దస్త్రాల్ వ్రాసి యేతంత్రి [3] కపితాను నెత్తఁ గొట్టెఁ
దగఁబ్రాంసుదొరలతోఁ దగవులకేర్పడియేదిటువరి నిర్వహించి మించెఁ
గరితోరుపట్నాలు గలుగుమంత్రులలోనఁ జెలఁగి యేమేటి ప్రసిద్ధిఁ గాంచె
తే. సకలభాషలు మాటాడఁజమునవ్రాయ,నిపుణతవహించియెవ్వాఁడుసెగడెజగతి
నట్టితిరువేంగళేంద్రుగుణాతిశయము,లెలమిఁ బన్నగపతి కైన నెన్న వశమె? 59

సీ. ఏతంత్రియుజ్జ్వలశ్వేతాతపత్రంబు పరితాపమును జేయుఁ బగతురకును
నేజనపాలుని తేజంబు చీఁకట్లు గ్రమ్మించు రిపుకోటికన్నుఁగవల
కేసెరయోధను దానఘనుం డధికము సేయు వైదిశోకానలంబు
నేమంత్రిసత్కీర్తి సోముఁ డించిం(కిం)చు నిర్జిన్రారిసేనాసముద్రములను
తే. జగతి నేమేటి నెరడాక సాటియైన,సుంతులకు గుండె గాలంబుమాడ్కిఁదనర
నట్టితిరువేంగడేంద్రుడీ టైనయోధ,కలుగ నేర్చునె మూఁడులోకములయందు.

క. అతనికులపాలికామణి,పతిభక్తివిశాల బంధుపరిపాల యరుం
ధతిసదృశశీల బుధసంస్తుతసద్గుణజాల లక్ష్మమాంబిక వెలయున్.

చ. సతిపతు లిద్ద ఱెంతయును సం(తతి)పద గాంచు తలంపునన్ మహా
వ్రతములుఁ దీర్థయాత్రలుఁ దపంబులు బ్రాహ్మణపూజయున్ శివా
యతనిలయంబులున్ వనచయంబులు సత్రము లగ్రహారముల్
వితతతటాకపాళి చలివెందర లచ్చుపుభక్తి సేయఁగన్.

1 General. 2 Council. 3 Captain.

వ. ఇవ్విధంబున నప్పుభూవరులు సుపుత్త్రులం బడయుటకై కొలుచుపూజల శ్రీకృష్ణమూర్తి సంతసిల్లి తొల్లి నందునికులంబున నవతరించెదనని యతనికి వరం బొసంగినవిధంబు దలంచి యీతిరువేంగడనాథునకు లక్ష్మమాంబికకుంగూర్మినందనుఁడై యుద్భవింతుంగాక యని నిశ్చయించి. 63

మ. క్షితిలోఁ గోసలరాజవర్యసుతకున్ శ్రీరాముఁడా పార్వతీ
సతికిన్ శక్తిధరుండు గల్గునగతి గృష్ణస్వామి విఖ్యాతిగా
నతులప్రౌఢిని లక్ష్మమాంబసుతుఁడై యానందరంగక్షమా
పతిచంద్రుండన నుద్భవించెను గళాభాగప్రపూర్ణాకృతిన్. 64

క. అతనికి సహోదరుండై, మతిధృతివితరణకళాచమత్కారమహో
న్నతుఁడు తిరువేంగడమహీ, పతి యుద్భవమై చెలంగె బాలార్కశ్రీ యన్. 65

సీ. ధైర్యంబు సంతతౌదార్యంబు శౌర్యంబు గాంభీర్యచాతుర్యకౌశలములు
మతిశక్తి ఘనయుక్తి మధురోక్తి పితృభక్తి యుచితజ్ఞతయునీవియోర్పునేర్పు
దాక్షిణ్యమును జల్లఁదనము చక్కఁదనంబు రసికత యాశ్రితరక్షకతయుఁ
దారతమ్యప్రౌఢి తంత్రంబు శీలంబు సత్యవాక్యోన్నతి చలము బలము
తే. నగ్గలతోఁ బాలతోఁ దల్లి యొనరఁగూర్చి, ప్రేమ నల్లారుముద్దుగాఁ బెంచినట్లు
లఖిలసుగుణాభిరాముఁడై యనుదినంబుఁ, బ్రబలె నానందరంగభూపతికిరీటి. 66

చ. తెలివికిఁ బుట్టినిల్లు జగదీశుల కెల్లను మేలుబంతి వి
ద్యల కొరగల్లు తాలిమికిఁ దావు వదాన్యతకున్ నిధాన మా
ప్తులకును మెట్టపంట కవిభూసురవాటికి గల్పవాటి యై
కలియుగకృష్ణమూర్తి యనఁ గాంచెను రంగవిభుండు కీర్తులన్. 67

సీ. శ్రీవిష్ణునంశచే నావిర్భవము చెందుకతమున శ్రీరంగపతి యనంగ
సర్వజనానందసంధాయి యగుటచే నెలమి నానందరంగేంద్రుఁ డనఁగ
నఖిలదిక్కుల విజయముఁ గాంచగా విజయానందరంగభూజాని యనఁగ
మెచ్చి పాచ్ఛా కితా బిచ్చుటచే వజారతవిజయానందరంగరాయ
తే. లనఁగ బౌరుషనామధేయముల వెలసి, శుక్లపక్షసుధాకరస్ఫూర్తిగాను
దినదినంబున కమితవరిష్ఠుఁ డగుచుఁ దేజరిల్లును దులలేనిరాజసమున. 68

సీ. బంగారుకొండ దా ముంగిట నమరెనో సురభూజరాజంబు పెరటిచెట్టో
శ్రీరామమాడసంచితముగానున్నదో కామధేనువు దొడ్డిఁ గట్టినాఁడో
రసవాదశక్తి కరస్థలామలకమో తలుచునిక్షేపంబు దొరకినదియొ
తగధనాంజనవిద్యఁ దా నేర్చుకొన్నాఁడో స్పర్శవేధియు బొక్కసమునఁ గలదో

తే. కొఱయుండిన నిటుల లక్షలకొలంది, నిచ్చి యర్థులఁ దనియింప నెనరిశైక్య
మని జనంబులు దనకీర్తి వినుతిసేయఁ, బ్రబలు జితవైరి యానందరంగశౌరి. 69

శా. అంతం జెంగలిపట్టునం దనయశేషాద్రీంద్రు సత్పుత్రి యా
కాంతారత్నము రూపవిభ్రమకళాకారుణ్యదాక్షిణ్యవి
శ్రాంతిన్ లక్ష్మిని మించుసద్గుణసమాజన్ మంగతాయీసతిన్
సంతోషంబునఁ బెండ్లియాడె విభవైశ్వర్యంబు లుప్పొంగఁగన్. 70

సీ. సదమలపతిభక్తి సాత్వదరుంధతి యసమానగుణముల నాదిలక్ష్మి
దీనులపాలిటిదేవతారత్నంబు నన్నదానప్రౌఢి నన్నపూర్ణ
యాశ్రయించినవారి కసురునిక్షేపంబు పొలుపొందునోర్పున భూమిదేవి
కొనియాడువారికిఁ గొంగుబంగారంబు బంధుజనములకుఁ బారిజాత

తే. మనుచు జనులెల్ల వేనోళ్ల నభినుతింప
సత్యమును ధర్మమును బద్ధఁ జల్లిదనము
దయయు దాక్షిణ్యమును బూని ధరను బ్రబలు
మానినికురుంబ యుల మేలుమంగమాంబ. 71

సీ. కన్నులా చిన్నారిపొన్నారికి బిడారు చూపులా కరుణకుఁ బ్రాపు దాపు
పలుకులా సత్యసంపదలకుఁ బుట్టిల్లు గుణములా యమృతొనకు నిలయంబు
వితరణమా సదావిశ్వవిఖ్యాతంబు శీలమా లోకప్రసిద్ధికరము
చిత్తమా బహుధర్మచింతనాయత్తంబు పుణ్యమా సౌజన్యమునకుఁ దావు

తే. నగుచు నేసతీమణికిఁ జెన్నలరు నట్టి, శ్రీ మదలమేలుమంగమ్మ చెయ్యివట్టి
నదిమొదలు ప్రాజ్యసామ్రాజ్యపదవిరఁగ, భూపతికినాఁడునాఁటికుప్పొంగకున్నె.

సీ. పెండ్లియాడినమొదల్ పెనిమిటి కైశ్వర్య మధికమై వెలసినయతిశయంబు
చేపట్టినదిమొదల్ చెలువునకును గీర్తి విస్తరిల్లుచువచ్చువిస్మయంబు
బొట్టుగట్టినమొదల్ పురుషునకునుమండలాధిపత్యము వచ్చునద్భుతంబు
చేకొన్నయదిమొదల్ చెలఁగి భర్తకు దొరా దొరలెల్ల స్వవశులై పరఁగువింత

తే. యింతయంతని కొనియాడ నెవరివశమ్ము, మహితలక్షణవతి యైనమంగతాయి
యాదిలక్ష్మియె నిజము కొదనిన నెట్లు, రంగశౌరికిఁబట్టంపురాణియగును. 73

క. అని జనములు దనుఁ బొగడఁగ, ఘనతరగోభూహిరణ్యకన్యాదానా
ద్యనుపమదానంబులు భ, క్తినిభూసురకోటి కొసఁగి కీర్తిఁ జెలంగున్ 74

వ. అంత. 75

గీ. సీమలోనుండి ఫ్రాన్సురాట్ఛిఖరుండు పనిఁడిబెత్తంబుభూషణాంబరము లనిచి
కంపిసిద [illegible] రహిఁ జెలఁగమిఁ జేయానందరంగశౌరి. 7

సీ. విసువక యేవేళ విషదవృత్తి భరించు కులపర్వతంబులకొలఁది యెఱిఁగి
చెదరి మూలకుమూలఁ జేరినహరిదంత దంతావళంబులఁదారిఁ జూచి
యెన్నాళ్లకును దల లెత్త నేరక యుండు పన్నగవల్లభు బలిమి గాంచి
సతతంబు తా నధోగతిఁ బడియున్నట్టికచ్ఛపప్రభునియోగ్యత గణించి
తే. లీల సర్వంసహారమణీలలామ, శ్రీవజారతరాయఁడై చెలఁగువిజయ
రాజితానందరంగవీరాగ్రగణ్యు, పటుభుజాస్తంభమున నిల్చి ప్రమద మొందె. 77

వ. తదనంతరంబ. 78

సీ. సదమలాచారంబు సత్యవాక్యప్రౌఢి యమర చెల్వొందు లక్ష్మాంబ యనఁగ
దయయు దాక్షిణ్యంబు ధారాళగుణముచే హావణిల్లుకతన స్వర్ణాంబయనఁగ
అమరిక బుద్ధి శీలము నోర్పు నేర్పుచేఁ జెలివొందు జానకీదేవి యనఁగ
హరిభక్తి గురుభక్తి యాశ్రితావనశక్తిఁ బరఁగి శ్రీత్రిపురసుందరి యనంగ
తే. నలుగురు సుపుత్రికలు తదానందరంగ, రాయశేఖరునకు మంగతాయిసతికి
నుదయమొందిరి సంతతాభ్యుదయ మొదవఁ, దల్లిదండ్రు లయ్యుల్లము ల్పల్లవింప.

క. ఆవిజయరాయరంగసుధీవరుసహజన్ముఁడై నతిరువేంగడగో
త్రావిభుఁడు నాఁడునాఁటికిఁ, బూవులచేరెత్తినటులఁ బొసఁగి చెలంగెన్. 80

గీ. ప్రాన్సుపుడతకీసుహార్వపార్సి తెనుఁగు, నరవమును మొదలయినభాషాంతరముల
మాటలాడఁజదువ వ్రాయ మేటియగుచు, సాంద్రతరకీర్తితిరువేంగడేంద్రుఁడమరె.

క. నెరయోధ యై తగినయూ, తిరువేంగడభూపమణికిఁ దిరువేంగడధీ
పరమతాళి రాజరాజేశ్వరి యనుసత్పుత్రికయును జనియించి రాగిన్. 82

సీ. చక్కఁదనంబునఁ జక్కరవిలుకాఁడు చల్లఁదనంబునఁ జందమామ
మిక్కుటమైనట్టిలెక్కకు శేషాహి విక్రమక్రమమున విక్రమార్కుఁ
డమరు నశ్వారోహణమున రేవంతుఁడు సురుచిరవాక్ప్రౌఢి సురగురుండు
ఘనదానవైఖరిఁ గలియుగకర్ణుండు సత్యవాక్యమున నజాతవైరి
తే. యనఁగఁ జెలువొంది తిరువేంగడావనీంద్రు
గర్భకలశాంబునిధికి రాకామృగాంకుఁ
డగుచు నానందరంగేంద్రుఁ డనుదినంబు
మనుపఁ దిరువేంగడేంద్రుండు మహినిఁ బ్రబలె. 83

వ. తదనంతరంబ. 84

సీ. ప్రభవవత్సరధనుర్మాసశుద్ధాష్టమిభానువాసరము రేవతియుఁ దనర
లగ్నంబు కటకమారాశిని గేతువు నాలుగింటను సూర్యనందనుండు

నాఱింట రవిబుధు లలసప్తమమున బృహస్పతికవిరాహు లష్టమమున
మహితసూనుఁడు నవమమునఁ జంద్రుఁ డుగతి ఘనసార్వభౌమయోగం బెసంగ
తే. రాయసింహాసనాసీన రంగపతికి
శ్రీమదలమేలుమంగాసతీమణికిని
రమణ ముద్దువిజయానందరంగరాయ
చంద్రుఁ డుదయించె సత్కళాసాంద్రుఁ డగుచు. 85

సీ. ఈధన్యుఁ డేకదా యెలమి సాక్షాద్విష్ణు నంశచే నుదయించినట్టిదేవుఁ
డీఘనుఁ డేకదా యిల ఢిల్లిపాచ్ఛాయిచేతఁ బూజలు గాంచు శ్రీనిధానుఁ
డీరాజరాజే గదా రాజసింహాసనోద్దామసామ్రాజ్యయోగశాలి
యీమహామహుఁ డేగదా మేటిమండలాధీశుల మ్రొక్కు లందెడికిరీటి
తే. యనుచు సకలమహీపాలు రభినుతింప, శుక్లపక్షస్ఫురత్సుధాంశువలె దినది
నప్రవృద్ధి ముద్దువిజయానందరంగ, రాయమణి పట్టభద్రుఁడై రహిఁ జెలంగు. 86

క. ఈలీల నిరుపమానమ్మహాలక్షణశాలి యగుచు నతఁ డొదవినయా
వేళం దనరునవగ్రహా, లీలావసరములు నేర్పరించెద వేడ్కన్. 87

వ. తద్విధంబు. 88

సీ. రతనంబులను జాల జతనమౌ నొలసూలు బలుకిరీటంబు సొమ్ములు చెలంగఁ
దెలిచల్వఁ గట్టి ముత్తియపుఁ బేరులు దాల్చి మురువైనచెంగోలు పూనిరత్న
సింహాసనస్థుఁడై చెనఁటివైరులఁ గొట్టి యఖిలధరామండలాధిపత్య
గర్వసంజనిత మాఘనసంభ్రమమునందుఁ జిత్తంబు లీనతఁ జేసి మించి
తే. తగ నజాతారి యగుచు నుత్తరముఖముగఁ
బొడవుగాంచుచుఁ గుడిక్రేవ యొడరఁ గాను?
అలుక తోఁచుట యవసరం బయ్యెఁ గటక
లగ్నయుతకేతునవసరోల్లాస మరయ. 89

గీ. మఱిచతుర్థాధిపతి శని సరిగె కంబి, నిలివలునకిరీటభూషాదిఁ దాల్చి
తూర్పు గని కుడికాలు ముందుంచి నిల్చి, యమరకేతుపట్టము గట్టు నవసరంబు. 90

సీ. మఱియు నయ్యాఱింట మెఱయుచున్న బుధుండు బలిమిమీఱఁ బసపుచల్లడముఁ బూని
బలుతోలుకుళ్లాయిపై నిన్నగొల్సును జుట్టిజందెంబు వేసుకొని విల్లు
నమ్ముచేఁ బూని యాయనిలునిదెస కేగి బలిమి సమస్తభూముల జయించి
యాగ్నేయదిక్కున కందుండి చనుదెంచి గగనమండలమున కెగసి నిలిచి
తే. దక్షిణాభిముఖంబుగాఁ దనరి యూర్ధ్వదృష్టి గైకొని శరము సంధించి మించి
పంతమున ముజ్జగముల దహింతు ననుచు నాగ్రహావేశమున నుండు నవసరంబు. 91

గీ. ఆఱిటను దగునినుఁడుపీతాంబరంబు,నరకిరీటము ముత్యాలసరులు దాల్చి
పరఁగఁగ జైలహాయ నెక్కి పశ్చిమమున, హాసుగా స్వారివెలువడునవసరంబు. 92

గీ. సప్తమాధిపతిగురుండు స్వర్ణకాంతి,వెలయఁగేతుసామ్రాజ్యాభివృద్ధి యొసఁగి
తగ శిరోవేష్టనముఁ బూని దక్షిణముగ, నమరి సైబుతిదిశఁజూచునవసరంబు. 93

సీ. ఆసప్తమస్థాన మగుచుకరంబున దీపించుశుక్రుఁడు తెల్లపాగ
తెల్లకోకలు గట్టి దివ్య మహాపచ్చనిగంధంబుఁ బూసుకొకాంతతోడఁ
దూర్పుఁ బడమటివాస్తువును దక్షిణముగ నెసఁగువాఁకిలి గలయింటిలోనఁ
బట్టిమంచముమూఁదిపఱుపుపై నమరి యష్టైశ్వర్యసంపన్నుఁ డగుచు నెడను
తే. జెయ్యి తలక్రింద నిడి దిండిచేరి మీఁదిరాజ్యమునఁ గల్గుపదవదరాతివితతి
నక్రమంబున ఖండింప నాత్మలోన్నమరి యోజన గావించునవసరంబు. 9

సీ. మఱియును నాస్థమస్థితరాహువు యమునిముఖముఁ బోలునట్టిముఖము
రక్తనేత్రముల ఘోరముగాను జూపట్టి యలశుభాయుర్యోగములను బూని
భక్షించునంతఁ గోపంబుతో వాయవ్యదిశఁ దల యాగ్నేయదిశను దోఁక
యుంచి కేతువును నత్యుగ్రతఁ జూచుచునవిశంబు సకలగ్రహములు తనకు
తే. వెఱచునట్లు మహాకారవిసరుఁ డగుచునుండు వేళ శరీరంబు రెండుగాను
విఱచి గాయాలచేఁ బ్రజ్ఞ మఱచిసోలియునిమీఁదనుబడియుండు నవసరంబు. 95

గీ. అష్టమాధిపతి కుజుండు నరుసుమూర్తి,యుముల దగుకిరీటమును దూఁణాంబరంబు
చెలఁగుసింహాసనమును దనచేత నెత్తి,యచటికేతువు కొసఁగెడునవసరంబు. 96

సీ. నవమాధిపతి శశి పవడాలకంబముల్ రతనాలకొణిగలు వితతములుగ
వెన్నెలకోకలు చందువలు గలమంటపం బొకటినిర్మించి యందున్నతాస
నమున హాసుగ నర్తనసుగీతవాద్యము లను గొంచు లేఖలువినుచు రాజ్య
శాసనుఁడై ధాన్యరాశి కట్టెదుటను రెండు ప్రక్కలఁ బైఁడివెండికుప్ప
తే. లొనర రత్నపరీక్ష చేయుచును గేత్ముజాతకులకును రెండవయాతఁ డగుచు
దిండుచేరుకొపడమటిదిక్కుఁ జూచి, యధికసంతోషమున నుండునవసరంబు. 97

క. ఈవిహి నవగ్రహములు నిఁజావసరస్థాయిఁ దనరి జాతకునకు సు
శ్రీయోగబలా(శ్రీవితతా)యుర్యోగము,హావిభవములొసఁగనతఁడుహావణిల్లునెడన్.

సీ. ప్రభవమొందిననాఁడె ప్రాంసురాజేంద్రుండు బహుమానములు చాలఁబనిచినదియుఁ
బలుకనేర్చిననాఁడె పాచ్చాయి మొదలైన ప్రభువులుభవ్యులై పరఁగినదియు
నడువనేర్చిననాఁడె కడిమిసీమను సుబా దొరతనంబునహించి మెఱసినదియు
నాడనేర్చిననాఁడె యఖిలభూపకులంబచేఁ గానుకకప్పము ల్గాంచినదియుఁ

తే. జనన నేర్చిన నాఁడె విస్తారమండలాధిపత్యంబుఁ బూని చెలంగినదియు
నందకులజముద్దువిజయానందరంగ, నృపతికే కాక కలుగునే యితరులకును. 99

సీ. చందమామను మించు నందమౌ నెమ్మోము కమలంబుల హసించు కనుల గోము
కదియఁబట్టినఁ బాలుగారు చెక్కులకోవి చిగురుటాకును మీఱు చిన్నిమోవి
వాసించు సంపెఁగవంటి చక్కని ముక్కు వజ్రాలఁ గేరు పల్వరుస చక్క
నన్నె దేరు విశాలవక్షఃస్థలము వీఁక యొనరు నాజానుబాహువుల జోఁక
తే. కలిగి మహిమ మహాపురుషలక్షణత నమరు, నితఁడు రాయసింహాసనాధీశుఁడగుట
కేమియాశ్చర్యమని జనులెల్లఁ బొగడఁ, బ్రబలు ముద్దువిజయానందరంగశౌరి.

వ. అంత. 101

సీ. మహిఁ బ్రమోదూతసంవత్సరాశ్వయుజశుక్లాష్టమిదినమున నమరునుత్త
రాషాఢయందుఁ దిన్యం బైనలగ్నంబు మేషమౌ రాశిని మెఱయు గురుఁడు
మిథునానఁ గేతువు మెలఁతయందుఁ గుజుండు తుల నర్క శుక్ర బుధులును వృశ్చి
కమున మందుఁడు కార్ముకమున రాహువు మకరమ్మునఁ జంద్రుండు రహిఁ జెలంగి
తే. కలితసామ్రాజ్యవిభవయోగం బెసంగ, రంగనృపతికి నలమేలుమంగమకును
దనర రెండవపుత్రుఁ డై తగి కుమార, విజయతిరువేంగడేంద్రుఁ డావిర్భవించె.

క. ఇల రామలక్ష్మణులనఁ బలకృష్ణులరీతి జంటఁబాయక వారు
జ్జ్వలయోగశాలులై తగి, తలిదండ్రులు సంతసింపఁ దనరుదు రెలమిన్. 103

వ. ఇట్లాపుత్రరత్నంబులు దినదినప్రవర్ధమానప్రతిభఁ బ్రబలిన నందగ్రజుండగు
ముద్దువిజయానందరంగరాయనృపాలుండు బాలగోపాలమూర్తివలె ముద్దుగుల్కు
చు సేతుశీతాచలాంతరధరావలయం బంతయు నేకచ్ఛత్రాధిపత్యంబుగా నేలుచు
రాయసింహాసనారూఢుం డగుటం జేసి యాతనిప్రబలజాతకఫలశుభసూచకంబు
నానాఁట విస్తరిల్లి వెలయుకతంబునఁ దదీయయోగాతిశయంబునకు దృష్టాంతం
బెట్టిదనిన. 104

క. ఇమ్మహిఁ బ్రబలిన ఢిల్లీ యమ్మహమ్మదుషా పాదుషా ధరాధీశ్వరుహు
క్కుమ్మున నాసరజంగమ్మునమ్మునఁ జేకొనక మెలఁగినఁ దా విని కినుకన్. 105

గీ. వడిగ నాసరజంగు సత్వం బడంచి, కోరి దక్షిణసుబ కట్టుకొమ్మటంచు
ఘనహిరాయతమొహదీనుఖానుఁ బూని, పాదుషా పంపనతఁడు పోర్బలము చెలఁగ.

వ. తద్విధంబునఁ బరిపంథికంధరసందోహగంధవహదుస్సహగంధాంధసింధుర బంధుర
సైంధవవరూథినీసంగతుం డై తరంగిణీభుజోత్తుంగతరంగమాలికలపోలికై దళంబు
వెంటనంటిరా వెడలి మందంపుఁగలమ్మట్టల మట్టువెట్టి యిట్టలం జేపట్టి మట్టు

మట్లారరయినదూప్లెక్సురాజేంద్రునిచేత నా౹నబాబునిజాములచేత ననేక స్తో
నల౯ బడసి యపారం బైన కీర్తింగాంచిన సకలదేశాధీశు లానందకందలిత
తే. వారవిందు లై. 107

శ్లో నున్న చందసాహేబును జెఱఁబాపి పిల్పించు నౌఱతనంబు
వ. రాయితమొహదీ౯ఖాను జతఁజేసి యనవర్ధిఖానుఁ గొట్టినచలంబు
ఛగా దండెత్తి వచ్చిననాసరజంగును దునిమినసాహసంబు
డు మొదలైనయట్టికర్ణాటక సుబకునబాబుగాఁ బ్రబలుశక్తి
ఁగాఁ గృష్ణ హద్దుకన్యాకుమారి,దాఁకఁ గలిగినదేశమంతయును గట్టి
సమర్థ్యము విజయానందరంగ,ఘనునకేగాక యొరులకుఁ గలదె ధరను? 108
కు నందగోపకులవీరవరేణ్యుఁడు రంగధారణీ
తునిచేతిహేతికినుక౯ వెస మార్కొని పోరఁ జూచుదు
తునిజాముసైన్యనికరంబులు కొద్దినిబోవనీయదా
కు నంతకుం బఱచునంతకు నంతకుఁ జేరునంతకున్. 109

నుండి వెడలి గోపురి గొని వాకిళ్లు చొరప నేర్చినరీతి చోద్య మయ్యె
మండలిని జొచ్చి రవిమండలముఁ జొచ్చి చనునది మిగుల నాశ్చర్య మయ్యె
నకేట మునింగి మిన్నేట తేచినచంద మెన్న విచిత్ర మయ్యెఁ
సంభములనుండి సురవధూకుచకుంభములకు లంఘించు టద్భుతము నయ్యె
రాయవినుతవజారతరాయవిజయ, విక్రమానందరంగభూవిభునిహేతి!
గడమున నింద్రజాలవిద్య గనుపింప,వలయుఁగాదేని రిపు లిట్లు మెలఁగఁగలరె ?
యిట్లు సకలజనములుఁ, గొనియాడ ననర్ఘరత్నఘోటకమదవా
భూషణాంబరంబులు, ఘనమోదము మీఱ నజరుఁ గైకొని వేగ౯. 111

అప్కారి యతాసైమలుప్కారిఖానుఁడు గరిమ యబ్బలిమీరుఖానుధీరుఁ
బ్బల్లబీఖానుఁ డబ్బల్లజీతుఖా౯ ఘనులు దిలావరుఖాను మేటి
బలుఁ డాహిమ్మదుఖాదరుఖానుఁడు సైదుషరీబుఖా౯ పానవాసు
నులు మహమదుఖాను నవాసులఖానుఁ డల్లనమూషిఖాను మేటి
దిగాఁ బేరుపెంపుచే నమరుపౌఁజు, దార్లు హుదురావులును కిలాదారులు సర
నులు వజీరులును సుబాదార్లు దొరలు, వచ్చి రానందరంగభూవరునిసభకు. 112
యును. 113

సరాజారామచంద్రరాయాగ్రణి జాకోటినింబాళుజనవరుండు
వంతుఁడు సులుతా౯జనింబాళును మాధవరావు

మీఱినచలంబునం బలం బగ్గలంబై కనుపట్టి బహుదూరంబు గడచిపోకను. 99
కుం బ్రాంసురాజు సహాయంబు సేయవలె నని మంతనంబునం జింతింపఁగోమ
చ్చేరికుంపినికిం గార్యస్వతంత్రియుఁ దండ్రియు మంత్రియు నైనక్లి
రంగనృపాలపుంగవునకుఁ గాగిదంబు వ్రాసి తనకు సహాయంబు సే
ప్రార్థించిన నత్తెఱంగంతయు దొరలైన [1]డూప్లెక్సు మహారాజున
పరమప్రయత్నంబున నతని సమ్మతిలంజేసి నిజతంత్రశక్తివలన నాత[illegible]డగుట
సూత్రంబులం బన్నియు, నచ్చటం జేరంబడియున్న ఛంధాసాహెబు [illegible]గశారి.
యాహిరాయిత మొహ(దీను) దిసిఖాను వెంటనంటిరా దిట్టపఱిచి పుదుచ్చే 101
రజాసాహెబునకు నవాబుతనం బిప్పించి, యతనివెనువెంట విక్రమవిక్ర
లగుఫ్రాన్సుసోల్దారులను నసహాయశూరు లగుబారుసిపాయీలను గూర్చి
దంపుసామానుల దిట్టపఱిచిన నమితోత్సాహంబున వెలువడి యారజాసాహెబు
ఛందాసాహెబు, హిరాయిత మొహ(దీను) దిసిఖానుండు మొదలయినశూరశి[illegible]
సుస్థిరై ఫ్రాంసుపౌఁజునుమున్నిడుకొని అనవర్దిఖానుని నతనిపౌఁజును నిముసమ[illegible]గి
బున ముంచి యార్కాడాక్రమించి మించినకీర్తిచేఁ బ్రకాశించినయానిజావ
బుల పుదుచ్చేరికిఁ బిలిపించి సకలవైభవంబులతోన దొరచెంతం దోడ్కొని[illegible]చె.
నవరత్నభూషణాంబరంబులు నపారంబుగా బహుమతినిగావించి మధుర,
పురి, మైసూరు, యిక్కేరి మొదలైనసంస్థానంబుల నిట్టట్టుగావించి తమపై 103
వచ్చి నాసరజంగు లక్షగుఱ్ఱంబుతోఁ బుదువాపురినావరించుకొనిన వాని నా[illegible]ండగు
నిలువనీయక తఱుమఁగొట్టి గులాంనహుషమహమ్మదుఖానుని బలాయమా[illegible]ల్కా
జేసి తురకతమాషుఖానుని నిర్నామంబుగావించి నబునిందుఖానుని దండంతర[illegible]చు
జాఱిలాడించి మహమ్మదుఅబరాల్ పాళెయం బంతయు నెత్తఁగొట్టించి మ[illegible]కంబు
దల్లిఖానునిపౌఁజంతయుఁ బటాపంచలై పాఱందఱిమి మఱియునుం గలుగు[illegible]ంతం
ధివీరుల నెచ్చ టఱకా లూఁదనీక చెల్లాచెదరుగావించి పరాక్రమించినం 104
మొదట నాహిరాయిత మొహదీనుఖానుఁడు నాసరజంగుదళంబునం జొచ్చి కీ
గుపెంటలు గావించి పేర్చి యార్చి పోరాడి యపగడంబుగా వారిచేఁ బట్టు 105
యాసుద్ది విని కట్టల్కారెట్టింప సామాద్యుపాయభేదంబులం దంత్రఁ
బన్ని యన్నాసరజంగుం ద్రుంగడంచి వారిదం డంతయుఁ జాఱిలాడించి
టియట్ల హిరాయత మొహదీనుఖానుని నిజాముపట్టనంబునఁ బ్రతిష్ఠించి యఁ చెలఁగ.
వజారతరాయఁ డనుబిరుదుపేరునుం జెంగలిపట్టుకిల్లా జాగీరునుం గుమార బంధుర
డైనముద్దువిజయానంద రంగరాయాగ్రణిపేర మూఁడువేలగుఱ్ఱంబునకు మదళ[illegible]బు
దొరతనంబును నవపత్తుమాయిమురాతంబు మొదలయిన మహారాజలాంఛనం మట్టు

# పీఠిక.

మట్లవారును హనుమంతరావు బరికి వేంకటరావుకపీలజంగు
నలరామరాజేంద్రుఁ డేఁచభూపాలుండు మగరాలవారును మాళరాజ

తే. వారు తక్కినపాళయప్పట్లదొరలు, ప్రబలుమోరోజిపంతులు రామదాఁ
పండితార్యులు మొదలైన ప్రభువు లెల్ల, వేడ్కఁ వచ్చిరి శ్రీరంగవిభుని

వ. ఇట్లతివైభవంబున సకలరాజాధిరాజులు నదురుగొని భేటికి వచ్చునెడ
వాకిలి నీవు ముందు నేను ముం దని చొరవ సేయుంబోయి యచ్చటి
మహాలుదార్లచే నిలుపరింపఁబడి వెలవెలఁబోయి యొండొరుల మొగంబులఁ
జూనుచు.

సీ. ఈహజారముచెంత నెంతయు భేటికై చేరి నిల్వనిదు నేదారు లెవ్వ
రీబంకునందు నకీబులచేత... ద్రొబ్బులు వడనినవారు లెవ్వ
రీవాకిటను జాలువావెండిబెత్తాలచేఁ బెట్లువడనివజీరు లెవ్వ
రీదరుబారున నెపుడుదౌవారికులఁ గనివేఁడనిహుగురావు లెవ్వ

తే. రైన నేమాయె నివి యవమానము లన, రాదు మహి నెంతవారికి రంగవిభు
సన్నిధిని హెచ్చుతక్కువ లెన్నఁదగునె, యనుచుఁ జేరిరి వారంద అతనిసభతో!

తే. ఇటులు సభఁజేరి వైభవం బెసఁగ మత్తవారణతురంగకాంచనవస్త్రరత్న
భూషణంబులబహుమానములు నొసంగ, నదురుఁ గైకొని యతులితానందముల

తే. వారివారికిఁ దగునుపచారములును
బలికి మర్యాద లొనరించి బాగుగాను
కరితురగరత్నభూషణాంబరము లొసఁగి
పనుప వీడ్కొని రత్నావహాభరితు లగుచు.

సీ. తనరాక విన్నమాత్రమున బల్లిదుఁడైన ఢిల్లిపాచ్ఛాగుండె తల్లడిల్లఁ
దనధాటి విన్నయంతనె జయసింగును భయపడి కౌన్కకప్పము లొసంగఁ
దనపేరు విన్నంత దద్దరిల్లి మరాటిపోఁజు చీకాకుగాఁ బరువులెత్తఁ
దనయాజ్ఞ బలునుబాదారులు నితరదేశాధినాథులు శిరసావహింప

తే. జగతిఁ బెంపొంద నాసరుజంగువంటి, వాని నవలీలఁ దెగటార్చి వన్నెవాసి
చెందిన వజారతవిజయానందరంగ, ఘనునిదృష్టికి నెవరైనఁ గాని యెదురె!

చ. నిలుకడ లేక ముందటికి నిల్వక నూటికి మించ కేరికిం
దెలియక యుండుబ్రహ్మలిపి ధీరవజారతరంగశౌరి వ్రా
యులలితశాసనాక్షరము లుర్విఁ దిరంబుగ నాస్తి రైయసం
ఖ్యలు నయి తేట యోఘునతఁ గాంచవె పూజ్యులు సేయుకార్యముల్.

మీ ప్రియభేరికాఘనధ్వని విన్నఁ బరరాజహంసలు పఱువు లెత్తు 99
కుం(ద్రు విధాటి సీక్షించినంతనె భోగికులంబులు పుట్టలెక్కు
చ్చేటు తేజంబు నిసుమంత విన్నంత శత్రుచక్రంబులు సంచలించు
రంసకేసరి హెచ్చుధాళను విన్న వైరికుంజరపాళి పూరిగఱచు
ప్రాయానందరంగధరాధినాథు, బలపరాక్రమశైఖరిఁ బ్రస్తుతింప
పగు మహిలోన మనవంటివారి కనుచుఁ, బొగడుచును దమతమదేశములకుఁజనిరి.

స్థంబున నబాబులు మొదలగునఖండమండలాధీశ్వరులచేఁ బొగడికలు గాంచి సమానవైభవంబు, ననుపమానకీర్తి, ననూనప్రభావంబు, నహీనదాతృత్వంబు, ఖండసామ్రాజ్యంబు, నపారతరైశ్వర్యంబు, నమితోత్సాహంబు, ననవరతలక్ష్మీక నాక్షంబు గలిగి చెలంగుచు నొక్కనాఁడు నిజపుత్త్రికాపుత్త్రికలకు వివాహోత్సవంబులు గావింప నిశ్చయించి చతుస్సముద్రముద్రితం బైనభూమండ బునం గలుగుప్రముఖులకు నాకల్యాణమహోత్సవంబు గనుంగొన వచ్చుటకై భపత్త్రికలును వస్త్రతాంబూలంబులుం దగువారిచేఁ బనిచి సకలలక్షణవతి య జానకీదేవిని నక్షీణలక్ష్మీకటాక్షవీక్షణాలంకృతుం డైనస్కందనృపాలపురం రునకు నిత్యకళ్యాణసౌభాగ్యవతి యైనత్రిపురసుందరీదేవిని, నహార్యవర్యధైర్య సిర్య శౌర్యగాంభీర్యాదార్యచాతుర్యైశ్వర్యధుర్యుం డగుచిదంబరనాథనరనాథునకు నగణ్యతారుణ్యలావణ్యసాద్గుణ్యనైపుణ్యమహాపుణ్యవతి యగురాజరాజేశ్వరినిన శేషభాషామణిసాలిశేషాశేషీకృతశేషాహిభాషాయోషాస్వామి యగునారాయణభూపాలునకుం గన్యకాప్రదానంబులు సేయసమకట్టి యసమానసమానలసమాచరూపానునయ దానవిదానసుగుణనిదానసకలకళావిరాజమాన యానారోహణస ...శ్రయుఁడునై సహజనందనుం డగుతిరువేంగడమహీపాలపుంగవునకు శ్రితజన కల్పకవల్లియుం బల్లవాధరీమతల్లియు నైనకనకవల్లీదేవినిం బరిణయంబుగాఁ గైకొన నిర్ణయించి కుబేరుని పుష్పకంబును గేరి యింద్రుని యాస్థానమండపంబును మీఱి, మయునిసభతోడఁ సరిపోరి, లక్ష్మీరంగస్థలంబు దారి విలసిల్లు పెండ్లిచవికలోన రవేయించి కెండులక్షలు నిష్కంబులుం బెండ్లిసెలవులు సేమకంబులుం జేసికొని దొడ్డకొంచెంబుల నెంచక నలువదిదినంబులు నొకనాఁటిచందంబునం బెండ్లివేడుకల నొనరింప నిశ్చయించి భూదాన కన్యాదానోపనయనదానాన్నదాన భూరిదానంబులును బదియాఱువిధంబుల మహాదానంబు లొనరించి యథాశాస్త్రప్రకారంబున వివాహమహోత్సవం బొనరించునవసరంబున. 122

ంబరవైరినిం గెలుచుచక్కఁదనంబును వారివంటిభో
'బును గల్గుకందవిభు కందనృపుం గబరీనిరస్తరో

...ముదాతలదాతరై మేటి యగుచు, శ్రీపెరంబూరివంశకిరీటి యగుచు
...న వజారతరాయవిజయ, విక్రమానందరంగభూవిభుఁడు వెలయు. 129

## షష్ఠ్యంతములు.

...ృదిసకలగుణసాంగత్యునకు నసాధ్యకార్యఘటనాధ్యునకున్
మహాసత్యమహాకృత్యమహారాజమణికిఁ గృతధోరణికిన్. 130

...శనబలశాసన, జలజాసనభక్తివిభవచాతుర్యునకున్
భిషణబలశోషణ, బలభూషణునకు నపారపటుధిషణునకున్. 131

...యకనటనాయక, విటగేయకసద్విశేషవితరణగుణికిన్
...హితపటవాతత, చటులోద్ధతశౌర్యనికరసజలాబ్దునకున్. 132

...హితకమలాహిత, కమలాహితసదృశశౌర్యకరుణాకృతికిన్
...నోగమసుమనోవిమ, లమనోజ్ఞమణీసముజ్జ్వలవిభూషునకున్. 133

...కులామందకలానందవిలాసప్రభావునకు సారసభూ
...నహరిచందనహరి, చందనహరినిభయశోవిశాలద్యుతికిన్. 134

...వనజనపావనఘన, పావనగుణశాలికి సముపార్జితభాస్వ
...ద్భావిజయశ్రీవిజయ, శ్రీవిజయానందరంగనృపచంద్రునకున్. 135

అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన లక్షణచూడామణి యైన
యానందరంగచ్ఛందం బనుపేరం జెలువొందులక్షణగ్రంథంబునకుం గవితాలక్షణ
ప్రకరణంబునకుం గలిగినమార్గంబు లన్నియు విశదంబుగా వివరించెద. 136



అంబకదంబ మంజులకలానికురుంబ గుణావలంబ నై 99
య్యంబున జానకమ్మ వరియించె హరిన్ వరియించు శ్రీవలెన్.

సీ. కలితాబ్ధికన్యకాకలితశుభాగారు నభినవమదనమోహావశరీరు
నిఖిలలోకైకపర్గితకీర్తివిస్తారు భానుసూనుసమానదానశూరు
విశ్వవిశ్రుతసర్వవిద్వజ్జనాధారు జాంబూనదాచలసదృశధీరు
ఘనసదాశివమహీకాంతప్రియకుమారు శ్రీచిదంబరనాథనృపవజీరు

తే. మానవిభవసమానసుశ్రీనిధాన, యైనత్రిపురసుందరి పెండ్లియాడెఁ గోరి
జనకసుకుమారి శ్రీరామచంద్రుఁ జేరి, పెండ్లియాడిన దారిన ప్రేమ మీఱ[1]

మ. రవితేజున్ ఘనపుణ్యమూర్తిని యశోలంకారునిన్ వీరరా
ఘవునారాయణభూమిపాలకమణిం గారుణ్యసంశీలన
ర్మవచోజాలగుణాలవాల యగుశ్రీమద్రాజరాజేశ్వరీ
యువతీముఖ్య వరించె గౌరి వృషవాహుం బెండ్లి యైనట్టులన్.

సీ. సంతతసత్యభాషాహరిశ్చంద్రుని వరనందగోపాలవంశచంద్రుఁ
డనఘుఁ డాతిరువేంగడాధీశుపౌత్రుఁడు తిరువేంగడకుమారాధిపతిపుత్త్రుఁ
డానందరంగభూజానిప్రియకుమారుఁ డలపెరంబూరిసత్కులవిహారుఁ
డలమేలుమంగాంబ యరిమి పెంచినబాలుఁ డలకుమారతిరువేంగళనృపాలుఁ 03

తే. డతులలక్షణవతి రూపవతి శుభవతి, పుణ్యవతిని యరుంధతిఁ బోలుకనక
వల్లిపతి నుల్లమలర వివాహమయ్యెఁ, గృష్ణమూర్తి రుక్మిణిని వరించినటులు.

క. ఈరీతి పేర్మి మీఱఁ గుమారీమణులకును సత్కుమారునకు మహో
దారతఁ గల్యాణములు, శ్రీ రంజిలఁ జేసి ముదము చేకొని వెలయన్.

సీ. రాజాధిరాజులు రాయమన్నీలు సుబాదారులు వజీరు ఫౌజుదారు
సంస్థానపతులు నిజాముల్ నవాబులు వర్తకుల్పాళెయప్పట్లదొరలు 104
మొదలైనవారు సొంపుగఁ బెండ్లిపేడుక గనుఁగొని యాశ్చర్యకలితు లగుచు
నవరత్నభూషణాంబరగజాశ్వంబులు నదరులు ఘటియించి బదులుగాంచి 105

తే. పీడ్కొనిన యంతనత్యంతవిభవ మొదవ, నల్లురకు మువ్వురకుఁజాల నరణమిచ్చి
కూఁతురులు మదిఁ గోరినకోర్కె లొసఁగి, యొసఁగి సౌభరిసంతతి పొసఁగి వెలయు.

సీ. ఇటులు సమస్తధాత్రీంద్రులు వజీర్లు బలురాయమన్నీర్లు ఫౌజుదార్లు
మొదలైనదొరలచేఁ బాండికల్ గైకొని పుత్రులు పుత్త్రికాపౌత్త్రులాప్త
భృత్యులు మంత్రులు హితులు బంధువులతోఁ దామరతంపరదారి నలరి
యాసేతుశీతాచలాంతదాననియందు నాచంద్రతారార్కయశము నించి

# ప్రథమాశ్వాసము.

---

## గ్రంథప్రారంభము.



శ్రీరామారమణపదాం
భోరుహపూజావిశేష బుధసత్కృవిమం
దారా! విపత్క్షశైలక
ఠారా! యానందరంగధరణీశమణీ ! 1

గీ. అవధరింపుము నీపేర నంకితముగ, సకలలక్షణగ్రంథవిస్తారసార
పటిమ లన్నియు నొకటిగా ఘటనపఱిచి, లక్షణగ్రంథ మొనరింతు రంగనృపతి!

క. సుకవీంద్రులు తల లూఁచఁగ, గుకవు లొగిఁ దలలు వంచుకొనఁ జేసెద నే
నొకలక్షణకావ్యంబును, రకముగ నానందరంగరాట్ఛంద మనన్. 3

గీ. లక్షణమెకాని యెఱుఁగరు లక్ష్యపటిమ, లక్ష్యమే కాక యెఱుఁగరు లక్షణంబు
కొంద ఱానంద తానంద మొంద లక్ష్య, లక్షణము లేర్పరించెద రంగనృపతి! 4

వ. తద్విధం బెట్టిదనిన. 5

క. చను నుత్తమగండాధ, ర్వణహనుమదనంతసు(స)కవి రాక్షసజయదే
వనుత శ్రీధరగోక, ర్ణనీలకంఠాదిభీమనచ్ఛందంబుల్. 6

వ. ఉత్తమగండచ్ఛందము, హనుమచ్ఛందము, అధర్వణచ్ఛందము, అనంతచ్ఛందము, కవిరాక్షసచ్ఛందము, జయదేవచ్ఛందము, శ్రీధరచ్ఛందము, గోకర్ణచ్ఛందము, నీలకంఠచ్ఛందము, ఆదిసుకవిభీమనచ్ఛందము యీదశవిధచ్ఛందంబులు గాక లక్షణగ్రంథములగు [1]నన్నయభట్టులక్షణసారంబును, విన్నకోట పెద్దిరాజు నలంకారశాస్త్రంబును, రఘు [illegible] క్షీయలక్షణదీపికయును, భైరవునికవిగజాంకుశమును, నప్పనయాంధ్రప్రయో [illegible] ము, నెత్తూపై గడ కవిసర్పగారుడము

[illegible] చిన నశుభము. మూఁడాంగచూడామణియు

బూ ఓ గ జ డ ద బ ల వా" అనునిపది యు భూబీజాక్షరములు వీనిఁబద్యాది నుసుప శుభము. నాలవవరుసయందలి "ఈ ఞ జౌ ఘ ఝ ధ ధ భ వ ళ" లను పదియక్షరములు జలబీజాక్షరములు. వీనిఁ బద్యాదినుంచిన శుభము. ఐదవ వరుసయందలి

గ్రోడీకరించి సారవంతంబుగా సకలకవిజనసమ్మతంబుగా లక్షణలక్ష్యంబు లేర్పఱచి భవదీయ విపులకృపావిభవసంపాదిత మనీషాచాతుర్యంబున వివరించెద సాకర్ణింపుము. 7

## గణాష్టకసంభవనిర్ణయము.

క. హరుని త్రినేత్రములం దిగ, గురువు లాదవి మగణ మయ్యె గురుతుగ వరుసన్ యరసతజభనగణంబులు, స్థిరముగ దానికి జనించె శ్రీరంగనృపా! 8

గీ. అదు లచ్చులు కాదులు వ్యంజనములు, హల్లు లనఁ జెల్లు నందులో యరలవశష సహలు నంతస్థ లూష్మ లన్సంజ్ఞఁ దనరు, సుందరీమోహనాంగ యానందరంగ!

## స్త్రీపుంనపుంసకాక్షరనిర్ణయము.

గీ. సక్షలును రెండు నొత్తనియక్షరములుఁ, బదియు మగలచ్ఛషలు నొత్తఁబడినపదియుఁ రమణు లౌ జఞఙణనమయరవహలళలు, రహిని బేడులౌ నానందరంగశౌరి. 10

వ. సకారక్షకారములు రెండు నొత్తనియక్షరము లగుకగచజటడతదపబయనుపదియును గూడఁ బండ్రెండక్షరములు పురుషజాతివి. అకారాదిస్వరములు పదునైదు, నొత్తుగలయక్షరములు పదియును, శషలు రెండును మొత్త మిరువదేడక్షరములు స్త్రీజాతివి. జఞఙణనమయరలవహళయను నీపదునొకండక్షరములు నపుంసకజాతివి అని తెలియునది. మఱియు నీశ్వరునిమూఁడుకన్నులనుండి మూఁడుగురువులు పుట్టి మగణ మాయెను. దానివలన వరుసగా యగణరగణసగణతగణజగణభగణనగణంబులు పుట్టెను. 11

## గణంబు లుద్భవించిన యామములు.

గీ. సరవిని జయవిజయశంఖమహాశంఖ,ము లను జాల మయరసలు జనించె రాత్రిజాము లైనరామవిరామను, ప్త ప్రసుప్తలఁ దజభనలు పుట్టె. 12

క. ఏజామునఁ గృతిఁ బూన్చిన, నాజాముగణంబె మొదట నమరింపక వే ఱేజెప్పఁదగదు సద్గుణ,రాజిత యానందరంగ! రమణీయాంగా! 13

వ. అయెనిమిదిగణములు నెనిమిదిజాములయందుఁ బుట్టినవి గనుక నందుఁ బగటిజాములయిన జయవిజయశంఖమహాశంఖములైనట్టి మయరసగణంబు లుద్భవించె. రాత్రిజాము లయినరామవిరామప్తప్రసుప్తులు బంధువులయందుఁ దగణజగణభగణనగణంబులు పుట్టెను. నాయాచలాంతరాననియందు నాచంద్రతారార్కయశము నింగి

# ప్రథమాశ్వాసము.

ఇందుకు లక్ష్యము, కవిసర్పగారుడమున:—

సీ. జయవిజయాంబులు శంఖమహాశంఖ, ములనంగఁ బగటిజాములు చెలంగు
రాత్రిజాల్ రామవిరామసు ప్తప్రసు, ప్తలు ననఁగా భువిఁ బరగుచుండు
నీయెనిమిదిజాలఁ బాయక మగణాది, గా జనించె గణాష్టకంబు వరుస
నేజామునను గావ్యఁ డెలమిఁ గబ్బంబును, విరచింపఁ బూనె నవ్వేళయందు

తే. నుద్భవం బైనగణముఁ బ్రయోగమునకు, శుద్ధి గాఁ గూర్పలేక విజ్ఞోడుపడఁగ
గణము లూహించి కూర్చిబికారికకవి, పద్య మొల్లఁడు ప్రదు కౌసపడెడువాఁడు.

## బీజాక్షరనిర్ణయము - వానిశుభాశుభ ఫలములు.

క. ఆదిక్షాంతాక్షరముల, నైదువరుస లునుప వరుస కవి పది యగుచుఁ
బ్రోదిఁ బవనాగ్నిభూజల, ఖోదితబీజాక్షరమ్ము లొగి రంగనృపా! 16

గీ. అనిలబీజాళి శోకదం బగ్నిబీజ, సమితి మడియించు భూమిబీజములు శ్రీద
మంబుబీజము ల్మదమిచ్చు నభ్రబీజ, రాజి లేము లొసంగు శ్రీరంగభూప! 17

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఊ | ఏ | క | చ | ట | త | ప | య | ష | ౧౦ |
| ఆ | ఋ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | ౧౦ |
| ఇ | ౠ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | ౧౦ |
| ఈ | ఌ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | ౧౦ |
| ఉ | ౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | క్ష | ౧౦ |

వ. అకారము మొదలు క్షకారమువఱకుఁ గలయేఁబదియక్షరముల నైదువరుసలుగ వ్రాసిన నవి వరుసకుఁ బదియక్షరము లగును. అందు మొదటివరుసయందలి "అ ఊ ఏ క చ ట త ప య ష" లను నీపదియు వాయుబీజాక్షరములు. వీనిఁ బద్యాదినుంచిన నశుభము. రెండవవరుసయందలి "ఆ ఋ ఐ ఖ ఛ ఠ థ ఫ ర స" లను నీపదియు నగ్నిబీజాక్షరములు. వీనిఁ బద్యాదినుంచిన నశుభము. మూఁడవవరుసయందలి "ఇ ౠ ఓ గ జ డ ద బ ల హ" లనునీపదియు భూబీజాక్షరములు. వీనిఁబద్యాది నునుప శుభము. నాలవవరుసయందలి "ఈ ఌ ఔ ఘ ఝ ఢ ధ భ వ ళ" లను పదియక్షరములు జలబీజాక్షరములు. వీనిఁ బద్యాదినుంచిన శుభము. ఐదవ వరుసయందలి

"ఉ ఋ అం జ ఞ ణ న మ శ క్ష" లను నీపదియు నాకాశబీజములు. వీనిఁ బద్యా
ది నునుప నశుభము. కాన సుకవీశ్వరు లగువారిది విచారించి పద్యముల రచియిం
చునది. 18

ఇందుకు లక్ష్యము, కవిసర్పగారుడమునః—

¶సీ. అఇఉఋఌను మఱి యాదీర్ఘవర్ణంబు, లైను నెకారాను లైను నవని
వరుసఁ గవర్గాదివర్గపంచకమును, యాను లైయును షాను లైదుఁ గూడ
నొండొంటితోఁ గూర్చి యొనరఁదొంతిగఁ జేర్చి, మూఁడుగాఁ జూచిన వానిలోనఁ
బ్రథమాక్షరంబులు పవనబీజంబులు, నవలివి దహనబీజాక్షరములు

తే. నవనిబీజంబు లాతృతీయాక్షరములు, వారిబీజంబు లాతలువాతి లిపులు
గగనబీజంబు లేనవకడలవెల్ల, వానికీడును మేలును వలయుఁ దెలియ. 19

¶మ. క్షితిబీజంబులు సంపద ల్పొదలఁ బోషించుఁ బయోబీజముల్
సతతంబుఁ బ్రముదం బొనర్చు శిఖిబీజంబు ల్మ్రతిం జేయు మా
రుతబీజంబులు శోకవారిధిఁ బడం ద్రోయుఁ నభోబీజముల్
పతి నత్యంతదరిద్రుఁ జేయుఁ గృతులఁ బద్యాది నొందించినన్ 20

అనంతచ్ఛందముః—

గీ. పరగుఁ గవితగద్యపద్యంబులన పాద,కల్పనంబు వలను గద్యమునకుఁ
బాదనియతి నొప్పఁ బద్యంబు లవియు వృ, త్తములు జాతులనఁగ[1]ఁ దనరుఁగృష్ణ.
(1. 6.)

## యతిప్రాసంబు లుంచు తెలుఁగు.

క. ఎన్నిట యతి రాఁదగునని, రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతి రాఁదగు నని, రన్నిటఁ దెనుఁగునకు మొదటియక్షర మమరున్. 22

సాహిత్యరత్నాకరమునః—

"ఛందోజ్ఞాన మిదం పురా త్రిణయనా ల్లేభే శుభం నందిరాట్
తస్మా త్ప్రాప సనత్కుమారక తతో౽గ స్త్య స్తతో వాక్పతిః,
తస్మా ద్దేవపతి స్తతః ఫణిపతి స్తస్యానుజః పింగళ
స్తచ్ఛిష్యై ర్మునిభి ర్మహాత్మభి రిదం భూమౌ ప్రతిష్ఠాపితమ్."

¶ఈరెండుపద్యములు కవిసర్పగారుడములో నిపనిక్కడ స్పష్టముగా ఉన్నది;
గాని, వీటినే (కొద్దిగా పాఠభేదములతో) కవిజనాశ్రయములో సైతము చూచినాము
(చూ. సంజ్ఞ. 58, 59) నిజముగా ఇవి ఎవరిపద్యములో తెలియదు.

1 నమరు.

లక్ష్యము భారతము, విరాటపర్వమున.—

ఉ. శ్రీయన గౌరినాఁ బరగు చెల్వలయుల్లము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁదాల్చి 'విష్ణు రూ
పాయ నమశ్శివాయ' యనిపల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చుపరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్. 21

శృంగారనైషధమున.—

మ. కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిన్ బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతు శాతోదరిన్. 22

ఆముక్తమాల్యదయందు.—

శా. అద్ధావాగ్విబుధం బహోవచనకవ్యాహార'మాహాఽవచ
స్సిద్ధమ్మాః కృతతాఁగతఃకలిరితి శ్రీసూక్తివిద్యాధరం
బిద్ధాధత్య మగాల్లయం హి కథియామిత్థం వదత్కిన్నర
మ్మద్ధీరాగ్రణిగెల్పుటుత్సవమునం దయ్యోన్నభంబంతయున్. 23

రుక్మాంగదచరిత్రమున.—

సీ. అంబుజభవసురేంద్రార్చితచరణాయ మరణదూరాయ నమశ్శివాయ
పద్మాప్తకోటిప్రభాదివ్యదేహాయ వృషవాహనాయ నమశ్శివాయ
డమరుత్రిశూలఖడ్గకపాలహస్తాయ మథితరోషాయ నమశ్శివాయ
గగనకల్లోలినీకలితోత్తమాంగాయ మౌళిచంద్రాయ నమశ్శివాయ
తే. మధువిరోధిశరాయ నమశ్శివాయ, మానిసంసేవితాయ నమశ్శివాయ
మదనదర్పహరాయ నమశ్శివాయ, మంత్రరూపాయ తుభ్యన్నమశ్శివాయ. 24

మఱియును రుక్మాంగదచరిత్రమున.—

సీ. దంభోళిధరసతీ తాంబూలపేటీషు దహనబింబాధరీస్తనభరేషు... 25

వ. అని తెలియఁదగినది. 26

గీ. ఇల నుకారాంతశబ్దము తెనుఁగులైన, నుత్వము విసర్గలోపమనా నొనరు పురుష
మేరు శ్రీరంగపతి రఘుదారి నాప్పు,రూరువలె బాహుబలిమిచే మీఱు ననఁగ. 27

తా. మేరు, ఊరు, రాహు, రఘు, లఘు, ధేను, మను, తను, గురు ఈ మొదలగు నుకారాంతశబ్దములు తెనుఁగులైనచో మేరువు, ఊరువు, రాహువు, బాహువు, రఘువు, లఘువు, తనువు, ధేనువు, మనువు, వసువు, గురువు అనియు, 'వు'కారము అంతమునలేకనే సంస్కృతశబ్దమువలెను చెప్పవచ్చును.

లక్ష్యము రఘుశబ్దమునకు భారతము, ఆదిపర్వమున.—

మ. రజనీనాథకులైకభూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ బ్రజవోలె ధర్మనియతిన్ బాలింపుచుం దొంటిధ
ర్మజు నాభాగు భగీరథుం దశరథున్ మాంధాతృ రామున్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాతపారిక్షితా! 28

బాహుశబ్దమునకు భారతము, విరాటపర్వమున.—

గీ. నేలనాలుగుచెఱఁగుల నృపులకొలువు,లందు నేను వర్తించితి నవనినాథ
యగ్గలించి నాయెదురఁ బాహాప్పళింపఁ,గడఁగఁజాలినమల్లులఁ గాననెందు. 29

రాహుశబ్దమునకు భారతము, శల్యపర్వమున.—

క. ఉర్వీచక్రము వడఁకెను, బర్వములేకుండ రాహు భానునిఁ బట్టెన్
పర్వతము లురలె వరటులు, సర్వదిశల నరచె నభము శర్కర గురిసెన్. 30

ఊరుశబ్దమునకు భారతము, కర్ణపర్వమున.—

శా. లీలన్ గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా
భీలత్వం బలరింపఁ ద్రిప్పఁ జదలన్ బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలన్ ద్రోచు మొగంబువ్రేయు దిశ లుగ్రస్ఫూర్తి వీక్షించు నో
కాలూరుం బయిఁ గ్రమ్మ నెక్కు మెడ నిక్కం ద్రొక్కు లేచున్ నగున్. 31

మేరుశబ్దమునకు పాండురంగమాహాత్మ్యమున.—

శా. మీఁదన్ దారధరాధరంబుగల యామేరు న్నగంజాలి త
త్త్రాదృక్షుండరుచిన్ దలిర్చుఖగయూథస్వామి హేమప్రభా
ప్రాదుర్భావశుభప్రదుండు మనుచున్ రామానుజామాత్య శ్రీ
వేదాద్రీశు విదూరిమందిరు జగద్విఖ్యాతచారిత్రునిన్. 32

వ. అని యీరీతి నున్నదిగనుకఁ దెలియునది. 33

గీ. పరగునభిలాషశబ్దము భ్రమపదంబు, నొవరు స్త్రీలింగరీతి నొక్కొక్కచోట
భ్రమను సుందరు లానందరంగపతికి, వలచి రభిలాష యెట్టిదో వారి కనఁగ. 34

తా. భ్రమశబ్దము, అభిలాషశబ్దము అకారాంతములఁగనుక నవి తెనుఁగులైనపుడు భ్రమము, అభిలాషము అని యుండవలెను. అట్లుగాక భ్రమ, యభిలాష అని స్త్రీలింగశబ్దములవలెఁ జెప్పవచ్చును.

భారతము, అనుశాసనీకపర్వమున.—

క. భ్రమచే నద్దేవునిఁ జిత్తమునం దిడి శరణుశరణు దయఁగావుము న
న్నమితైశ్వర్య... 35

వ. అని యున్నదిగాన ఁ దెలియునది. 36

గీ. హంస లన హంసము లనంగ నమరుఁ గృతుల, నిరుదెఱంగుల రంగనరేంద్రు కీర్తి
హంసమును గాంచి ధరఁ గల్గుహంసలెల్ల, మించ వెలవెలఁ బాఱెనటంచు బలుక.

తా. హంసయనియు, హంసమనియుఁ జెప్పవచ్చును.

లక్ష్యము భారతము, కర్ణపర్వమున.—

సీ. అనుటయుఁ గాక మిట్లను హంసములతోడ గతులు నూటొక్కటి గలవుగాన. 38

భారతము, ఆరణ్యపర్వమున.—

క. దమయంతికి నలునకు సం, గమకారణదూత యైనకలహంస మనో
జ్ఞమనుష్యవాక్యముల నా, దమయంతికి హర్ష మొదవఁ దా నిట్లనియెన్. 39

భారతము, కర్ణపర్వమున.—

క. బలశాలి యైనహంసముఁ, బిలిచితిపురుడించి పాఱ బేలతనమునన్
గలవే! యింతకుమును హం, సలతోఁ బురుడించువాయసంబులు జగతిన్. 40

వ. అని యున్నదిగనుకఁ దెలియునది.

గీ. కృతుల స్త్రీలింగమున లెఁ జరిప చరిత్ర, బరగు నానందరంగభూపాలుచరిత
వినవినఁగఁ జెవులకు జాల వేడ్కపుట్టి, మాధవచరిత్ర యాలించు మాడ్కి ననఁగ.

తా. చరిత, చరితము, చరిత్ర, చరిత్రము అని రెండువిధములుగను చెప్పవచ్చును.

భారతము, ఆదిపర్వమున.—

గీ. ధరణిప్రజఁ గరంబు దయతోడ సర్వధర్మాభిరక్షఁ బెంచి యమలచరిత
నేలి రాజ్యవిభవ మిదియేల నని తపశ్చరణ మునికి వనికిఁ జనియె ననఘ! 42

భారతము, ఉద్యోగపర్వమున.—

గీ. హితముఁ గర్తవ్య మెఱిఁగించి తీవు నాకు, ధర్మపుత్త్రుచరిత విదితంబు నీకు
నట్లుగావున వివరింపు మఖిలకార్య, జాతమును జిత్తతాపోపశమము గాఁగ! 43

చరిత్రకు భారతము, ఆదిపర్వమున.—

చ. హిమకరుఁ బొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పుచు నస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై యమలసద్గుణశోభితు లైనపాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీప్స మెంతయున్. 44

వ. అని యున్నదిగనుకఁ జరిత చరిత్ర అను రెంటికిని లక్ష్యములు వ్రాసినాఁడను. చరితము, చరిత్రము వాడుకలోనివి గనుక వ్రాయలేదు. 45

గీ. భువిఁ దకారాంతశబ్దముల్ పురుషపరము, లైన నూఁదుచుఁ దేలుచు నలరుఁగృతుల
నమరుఁ గైటభజితువలె యశముఁ గాంచు, శ్రీవజారతరంగధాత్రీశుఁ డనఁగ. 46

తా. కైటభజిత్తు, యుధాజిత్తు, పరీక్షిత్తు, ఇంద్రజిత్తు, సత్రాజిత్తు యివి మొద లగుపురుషవాచ్యశబ్దములు తెనుఁగున నొక్కొక్కదిక్కునఁ దేలికగాఁ గైటభజితు, ఇంద్రజితు, సత్రాజితు, యుధాజితు అనియుఁ జెప్పవచ్చును.

భారతము, ఆదిపర్వమున.—

చ. అనవరతాన్నదానయజనాభిరతుణ్ భరతాన్వవాయవ
ర్ధను సకలప్రజాహితవిధాను ధనంజయసన్నిభుం భవ
జ్జనకుఁ బరీక్షితుం బటుభుజంగుఁ డసహ్యవిషోగ్రధూమకే
తనహుతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిణ్. 47

వ. అని యున్నదిగనుక జాడ తెలియనది. 48

గీ. కలిగి యనుచోట నై యని పలుకవచ్చు,నం డ్రు శ్రీమద్వజారతానందరంగ
రాయమణి గంధసింధురరాజముఖ్య,చిరతరవిభూతి యై ప్రకాశించు ననఁగ. 49

తా. 'కలిగి' యనుశబ్దము నిలుపఁదగినచోట 'ఐ' యనుశబ్దము నుంచినయెడల నాయర్థమునే యిచ్చును.

లక్ష్యము భారతము, విరాటపర్వమున.—

క. అరుణాశ్వంబులఁ బూన్చిన, యరదంబున వీఁడె నిడుద లగుచేతులు బం
ధురకంధరంబు వెడలుపు,టురమును నై ద్రోణుఁ డొప్పె నుత్తర కంటే. 50

భారతము, ద్రోణపర్వమున.—

సీ. తెల్లనిగొడుగు నై తేజరిల్లుచు నున్న యల్లవాఁడే పాండవాగ్రజుండు... 51

భారతము, శాంతిపర్వమున.—

సీ. అర్థి విశ్వావసుఁ డాదిగాఁగలుగుగంధర్వులు హృద్యవాదన మొనర్ప
నప్సరోనికురుంబ మాటలుపాటలు నై వినోదింపంగ నమరగణము... 52

అని యున్నది.

గీ. పంచమివిభక్తిని నికారవర్ణ మొకటి, లోపముగఁ జెప్పవచ్చు మూల్లోకములను
గీర్తులను నించి మించి శ్రీకృష్ణుకంటె, నసము గనిరంగభూపాలుఁ డెసఁగె ననఁగ.

తా. కృష్ణుకంటె, కృష్ణునికంటె; రాముకంటె, రామునికంటె; అని పంచమీవిభక్తి రెండువిధములఁ జెప్పవచ్చును.

లక్ష్యము భారతము, విరాటపర్వమున.—

సీ. రాత్రిపైఁ దకీచకు రతిఁ బోరి మగఁటిమి వాసినయంగారపర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజు చెఱఁబట్టి మాన మేఁడినచిత్రసేనుకంటె

ఖాండవోద్యానంబుఁ గాన నేరక సిగ్గుపడి చన్న నిర్జర ప్రభునికంటెఁ
గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాను, బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె. 54

వ. అనియున్నదిగనుకఁ దెలియునది. 55

గీ. ప్రథమలు విశేషణములుగాఁ బలుకవచ్చు
షష్ఠికి రమాధవుఁడు రంగశౌరియొకఁడె
సాటి యగు శ్రీయుతుఁడు రంగశౌరి కనఁగ
ఘనుఁడు తిరువేంగళేంద్రనందనున కనఁగ. 56

తా. షష్ఠీవిభక్తికి విశేషణములైనశబ్దములు ప్రథమావిభక్తులుగఁ గూడఁ జెప్పవచ్చును.

లక్ష్యము భారతము, భీష్మపర్వమున.—

క. అపరాహ్ణసమయమున ని, ష్టుపమాతీతాతిఘోరయుద్ధం బయ్యెన్
విపులభుజబలుఁడు భీమున, కపరిమితబలుండు కౌరవాధీశునకున్. 57

వ. అనియున్నదిగాన జాడ తెలియునది. 58

గీ. వెలయ మూర్ఖధూర్తవృద్ధనీచపదాళి, కొనరు డుత్వమైన సుత్వమైన
క్షోణి రంగనృపతి సుగుణవృద్ధై యొప్పు, సకలరాజవర్యసభల ననఁగ. 59

తా. ధూర్తు, ధూర్తుఁడు; మూర్ఖు, మూర్ఖుఁడు; నీచు, నీచుఁడు; వృద్ధు, వృద్ధుఁడు; అని యీనాలుగుశబ్దములు రెండువిధములుగఁ బ్రయోగింపవచ్చును.

లక్ష్యము భారతము, ఉద్యోగపర్వమున.—

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగుఁ గాని నన్
మెచ్చఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ డట్టివానితో
నొచ్చెము లేక కూడి మన నూల్కొనియుండఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురువర్గము చావున కోర్వకుండుటన్. 60

భారతము, ఆరణ్యపర్వమున.—

క. అలయికయుఁ దలవడఁకు వెక్కలుజనియించుటయు నురలు గలుగుటయును వృ
ద్ధులలక్షణమే జ్ఞానము, కలదేనియు బాలుఁడైనఁగడువృద్ధరయన్. 61

వ. అని యున్నదిగనుక జాడ తెలియునది. 62

గీ. పరఁగ దిర్యక్కులిలశ్రేష్ఠపదము లైన, బహువచనకములుగాను బూన్పవచ్చు
చక్కనితురంగరాజుపై నెక్కి వెడలె, స్వారి యానందరంగభూజాని యనఁగ. 63

తా. తిర్యక్పదములైనశబ్దములు శ్రేష్ఠవాచకములైనపుడు పన్నగేంద్రము, పన్నగేంద్రుఁడు; మృగరాజము, మృగరాజు; పతగశ్రేష్ఠము, పతగశ్రేష్ఠుఁడు;

అశోక్త్తమము, అశోక్త్తముఁడు; గజేంద్రము, గజేంద్రుఁడు; అనియు నిదియొగాక ఉరగము, ఉరగుఁడు; సముద్రము, సముద్రుఁడు; ఘనము, ఘనుఁడు; అనియుఁ జెప్పవచ్చును.

లక్ష్యము భారతము, సౌప్తికపర్వమున.—

ఉ. అగ్గురునందనుండు హరిణావళిఁ గాంచి కుభృత్తటంబు నే
డిగ్గుమృగేంద్రుచాడ్పునఁ గడింది సుఘంటి యుల్లసిల్లఁగా... 64

భారతము, ఆదిపర్వమున.—

మ. వివిధోత్తుంగతరంగఘట్టనచలద్వేలావనైలావళీ
లవలీలుంగలవంగసంగతలతాలాస్యంబు వీక్షించుచుక్
ధవళాక్షుల్ చని కాంచి రంత నెదుటక్ దత్తీరదేశంబునం
దవదాతాంబుజఫేనపుంజనిభు నయ్యశోక్త్తముం దవ్వులక్. 65

భారతము, ఆరణ్యపర్వమున.—

క. గిరిశృంగతుంగవిగ్రహుఁ, డురుతరసత్త్వుఁడు విహంగమోత్తముఁ డప్పుడో
క్కరుఁ డొయ్యన నయ్యెడకుక్... 66

భారతము, ఆదిపర్వమున.—

చ. అరిదితపోవిభూతి నసురాదులఁ బాధలు నొందకుండఁ దా
నురగులనెల్లఁ గాచినమహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదుఁడు కద్రునంద నే
శ్వరునకు భూషితంబయినవాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడుక్. 67

భారతము, ఆరణ్యపర్వమున.—

క. మృగయార్థ మరిగి హిమవన్నగభూములయందుఁ బవననందనుఁ డొకప
న్నగుచేతఁ జిక్కెనడి యిమ్ముగ ధర్మజుచేతఁ దాను మోచితుఁ డయ్యెక్. 68

వ. అని యీతీరున విస్తారముగా నున్నదిగనుకఁ దెలిసికొనందగినది. 69

గీ. పడెఁ బఱచెఁ బట్టెఁ బాటను నమువు మొకట్ల, సంస్కృతంబునఁ జెల్లును శత్రువులను
భంగపడఁజేసి యానందరంగనృపతి, ధీజనులకష్టపాటెల్లఁ దీర్చె ననఁగ. 70

తా. పడె, పఱచె, పట్టె, పాటు ఈనాల్గుశబ్దములు సంస్కృతపదములు కొన్నిటియందుఁ జేరియుండవచ్చును. సుఖపడె, సుఖపఱచె, సుఖపెట్టె; దుఃఖపడె, దుఃఖపాటు, దుఃఖపెట్టె, దుఃఖపఱచె; సంకటపడె, సంకటపఱచె, సంకటపెట్టె; భంగపడె, భంగపెట్టె, భయపఱచె; అని యిటువంటిశబ్దములమీఁద నొకసమాసమువలె నుండవచ్చును.

లక్ష్యము.—

ఉ. దానవుచేతఁ గష్టపడి దైన్యము నొందుట కోర్వలేక నీ
దైవపదాంబుజంబుల భయంబు బనివేఁడితి... 71

భారతము, ఉద్యోగపర్వమున.—

గీ. తండ్రి లేనిప్రజలు తల్లిని బాసి పెద్దయునుగాల మవ్విధమునఁబడేతి
భంగపాటు దుఃఖపాటును సంకటంపాటుఁ గలిగె విరటు పాలఁ బిదప. 72

పాండురంగమాహాత్మ్యమున.—

సీ. దరిఁద్రొక్కియున్నయాతలిదండ్రు లనుజాలఁబడు చన్నె సంతోషపఱచవైతి....

భారతము, ఆదిపర్వమున.—

చ. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరుపాముల రోసిరోసి ని
ష్ఠురభుజదీర్ఘదండమునఁ డొల్లఁగవ్రేయుచు వచ్చి వచ్చి య
య్యొరనొకడుండుభం బనునహిం గని వ్రేయఁగ దండమెత్తుఁడుక్
హరిహరి యంచు డుండుభమహాహి భయంపడి చేరి భార్గవుక్. 74

వ. ఈరీతి నున్నదికనుక్కజాడ తెలుసుకొనఁ దగినది. 75

గీ. ఆంధ్రిభాషను నాలుగైదక్షరములపైని సంస్కృతపదముఁ బూన్పఁగను జెల్లు
మగువ లానందరంగేంద్రుతోఁగరుమోవి,యమృతమును గ్రోలనాసింతు రనుచుఁబలుక. 76

తా. తెనుఁగున నైదాఱక్షరములకు విశేషణములను నవతల సంస్కృతశబ్దము
విశేష్యముగను చెప్పవచ్చును.

భారతము, కర్ణపర్వమున.—

సీ. గీ. అవలికౌరవాధిశులఁ గవసికడిమిఁ
బొదవుటయు వన్నిశరముల భూరిరయము
మెఱయు నందఱఁ దెగటార్చి తఱుమ నతనిఁ
దాఁకె వేయు మూన్నూఱుదంతావళములు. 77

గీ. ఇంద్రునకు రుద్రుఁడత్తటి నిట్టులనియె, వనఘు యిరువదివేయుదివ్యాబ్దములు మ
హాతపం బొనరించెను నసుర వానికొసఁగె పద్మజుఁ డధికమహోగ్రబలము. 78

ఆముక్తమాల్యదయందు.—

మ. పునుగుంబిల్లివినోదనంబు మిరియంపుంబోళ్లతోఁ జట్టిచు
య్యునునాదారనిహారగుంపు ముకుమం దైరోర్చునాపం జిగు
ర్లొనసుపచ్చళ్లను బాయసాన్నములు నూరుంగాయలుం జేచురు
క్కనునేయుం జిఱుబాలవెల్లువుగ నాహారంబిడుక్ సీతునక్. 79

మనుచరిత్ర.—

సీ. కటికిచీఁకటితిండికరముల గిలిగింత సెవ్వాఁడు తొఁగకన్నె నవ్వఁ జెనకు... 80

వ. అనియున్నదిగనుక జాడ తెలియునది. 81

గీ. అగును స్త్రీలింగశబ్దంబు హ్రస్వముగ స,మాసమధ్యంబునను రంగమనుజవిభుని
కీర్తి హరజటాజూటసంకీర్ణదివ్య,గంగజలముల మితి మీఱు గరిమ ననఁగ. 82

తా. గంగాజలము, గంగజలము; తమసాతీరము,తమసతీరము; రాకాచంద్రుఁడు, రాకచంద్రుఁడు, నదీసుతుఁడు, నదిసుతుఁడు అని యీరీతి స్త్రీలింగశబ్దములు ఆకారాంత, ఇకారాంతశబ్దములవలె నుండవచ్చును.

లక్ష్యము, భారతమున, ఆదిపర్వమున.—

చ. జలరుహనాభ రమ్యగిరిసానువనంబుల వేఁట లాడుచుఁ
సలుపుద మీనిదాఘదివసంబుల నీవును నేను [1]నెమ్మదిన్
నలినరజస్సుగంధియమునా ప్రవదతుంగతరంగసంగతా
నిలశిశిరస్థలాంతరవి నిర్మిత నిర్మలహర్మ్య రేఖలన్. 83

రాఘవపాండవీయమున.—

క. నెలకొనియె వేఁటతమి న,బ్బలియుఁడు శిశిరనగరుచిరపరిసరమహిమం
గలతమసతీరసికతా,విలసనములు డెందమునకు విందొనరింపన్. 84

శృంగారనైషధమున.—

ఉ. రాకసుధాంశుమండలమురాకకు మాఱుమొగంబు వెట్టుచో
దీకొనివచ్చు దండధరదిక్ప్రవమాన మదక్షిణంబగున్... 85

వ. అనియున్నదిగనుక జాడ తెలిసికొనునది. 86

## వృత్తరత్నాకరప్రకరణము.

క. క్షితివృత్తనియమములసం,గతి విద్వజ్జనము లెన్న గణబద్ధములై
ధృతివెలయఁ జెప్పెద వజ్రా,రతవిజయానందరంగరాయబిడౌజా! 87

గీ. ధరను బ్రస్తార మనఁగ నధ్వం బనంగ, నష్టమన సంఖ్యయనఁగ నుద్దిష్ట మనఁగ
విను లగక్రియ యన నాఱువిధములుగను, ప్రత్యయములొప్పు నానందరంగశౌరి.

తా. ప్రస్తారప్రత్యయము, అధ్వప్రత్యయము, నష్టప్రత్యయము, సంఖ్యాప్రత్యయము, ఉద్దిష్టప్రత్యయము, లగక్రియాప్రత్యయము, అని యాఱువిధములప్రత్యయము లొప్పును. అందుఁ

1 సున్నితష, న్నలిన.

## ప్రస్తారప్రత్యయము.

గీ. వరుస సర్వగురువు లుంచి గురువుక్రింద, లఘువు నవతలఁ బైబండిలాగు వ్రాసి దాపటను గురు లుంచఁ బ్రస్తార మయ్యె, ననఘ! యానందరంగరాయాగ్రగణ్య.

తా. ఎన్నవఛందము ప్రస్తరింపవలె నన్న నన్ని గురువులువరుసఁగవ్రాసియందు తొలిగురువుక్రింద లఘువును నావలఁ బైబంతి యెట్లున్నదో యామేరకు వ్రాసిదాపట గురువు వ్రాసినఁ బ్రస్తారమగును. ఇట్లు సర్వలఘువు లగువఱకు వ్రాయునది.

## అధ్వప్రత్యయము.

గీ. అమర నుక్తాది యిన్నిఛందములవఱకు
నెన్నివృత్తంబు లెఱిఁగింపు మన్న దాని
లెక్క రెట్టించి యందులో రెండు త్రోయఁ
దక్కినది యధ్వమగురంగధారుణీంద్ర! 90

తా. మొదటిఛందస్సు మొదలుకొని యిన్నిఛందస్సులవఱకు నెన్నివృత్తము లని యడిగినచో నడిగినఛందస్సుకుమాత్ర మెన్నివృత్తము లున్నవో యవి రెట్టించి యందులో రెండు త్రోసి మిగిలిన వెన్నియో యన్ని చెప్పునది.

## నష్టప్రత్యయము.

గీ. పలుకఁబడు లెక్క భాగ మేర్పడినలఘువు,వ్రాసి బేసైన నొక్కటి వ్రాసిఁ గూర్చి యది సగము చేసి గురువుంచి తుదకుఁ గనిన,నష్టలబ్ధాఖ్య మయ్యె నానందరంగ! 91

తా. ఎన్నవవృత్త మేరీతి నుండు నని యడిగిన నాలెక్క భాగించి సరిగా నున్న లఘువువ్రాసికొని బేసిగానుండిన నొకటికూర్చి భాగించి యందుకు గురువు వ్రాసికొను నది. ఇట్లు కడదనుక భాగించుకొని గురువులఘువువ్రాయుచు వచ్చినట్లయిన నది నష్ట ప్రత్యయ మగును.

## సంఖ్యాప్రత్యయము.

గీ. వెలయ నీఛందమున నెన్నివృత్తము లన్నియడుగ నేకోత్తరంబుగా నదివఱకును గూర్చి యాలెక్క రెట్టించుకొనిన వృత్తసంఖ్య యగు నది రంగరసాతలేంద్ర!

తా. ఈఛందమున నెన్నివృత్తములు పుట్టు నని యడిగిన నెన్నవఛందము చెప్పు చున్నాఁడో యదివఱకు నేకోత్తరవృద్ధిగా రెట్టించి కడనువచ్చినలెక్కను రెట్టించి యిన్ని యని చెప్పునది.

## ఉద్దిష్టప్రత్యయము.

గీ. వృత్తమున గురులఘువులు పేర్చి దాని,క్రింద నేకోత్తరర్ధి లెక్కించి యాల ఘువులసంఖ్యతో నొక్కటి గూర్చుకొనిన, నామ ముద్దిష్ట మయ్యె నానందరంగ.

తా. ఈఛందములో నిది యెన్నవవృత్త మనియడిగిన నావృత్తమున్న మేరకు గురులఘువులు వరుసఁగా వ్రాసికొని దానిక్రింద నేకోత్తరవృద్ధిగా లెక్కలెన్నియందు లఘువులక్రింద నుండు లెక్కమాత్రము కూడి యందు మఱియొకటిగూడఁ గూర్చుకొని యిన్నవవృత్త మని చెప్పవలెను.

## లగక్రియాప్రత్యయము.

సులక్షణసారంబున:—

సీ. చక్రి లగక్రియాచక్రంబునకు మేరు వర్ధమేరు వనంగ నమరు నందు
నాదినొక్కటిఁ బెట్టి యాక్రిందటిండ్లలో నారెంటి నిడుచు నయ్యడ్డబంతి
రెండవ దాదిగా రెట్టించి దానిలో నొక్కటొక్కటి తీసి లెక్క విడుచు
నడిచాలిలో నొప్పుకడలెక్క కెక్కుడౌ నంతన నిలుపుచు నవలికడకు
తే. మీఁదియాలిమఱుఁచ లాదట నిసుమదుల్, గూర్చి వ్రాసికొందనను మునుపటి
వలెనె నొకటిత్రోసి వ్రాయంగ నగు నిట్లు, లన్నిఛందములను నవధరింపు. 94

సీ. వరుస నీచక్రాదిఁ బరగడ్డబంతిని సర్వగుర్వులవృత్తసమితి కలరు
నాక్రిందిచాలున నమరు వృత్తములెల్ల నొక్కొక్కమాత్రల నొప్పుచుండు
నావెనుకచాలిపద్యము లెల్ల రెండేసిలఘువులు గలవి యై లలిఁ దనర్చు
నానాలుగవచాలినలరువృత్తములు మాత్రలు మూఁటమూఁట నై తనరుచుండు
తే. నిటుల బంతుల కన్నింటి కిట్టిసంజ్ఞ, జరుగుఁ గడబంతివృత్తముల్ సర్వలఘువు
లిది లగక్రియ యనఁదగు నిలను బ్రత్యయంబు నాఱవ దైయొప్పు నంబుజాక్ష. 95

తా. మేరువు, అర్ధమేరువు అని రెండుకలవు. అందు మేరుచక్ర మిరువదియాఱుఛందములకు నిరువదియాఱిండ్లునిడివిని, బహుగా నిండ్లు నడ్డబంతులుండ వ్రాసి నిడివిబంతి మొదటియింట నొకటి పెట్టి యాక్రిందియిండ్ల ౨,౪,౮,౧౬,౩౨ యీక్రమమున రెట్టింపులెక్కలు నిరువది యారిండ్లను వ్రాసి, ఒక అడ్డబంతి రెండవ యింటి రెండును ఒకటి మూఁడు లెక్కపెట్టి అది రెట్టించి ఒకటితీసి ౫ ఆవలియింట వ్రాసి యీతీరున నిరువదియాఱుఛందములకును వ్రాసి మొదటినిడిబంతి రెట్టిలెక్కచేత నడ్డబంతుల నెల్ల నాయాపైబంతిఁ గూర్చి వ్రాయుచు నధిక మైనలెక్క పుట్టిన నిల్పి మఱి యాక్రిందటిరెంటిలెక్కను దాని కుఱుచ లెల్ల నన్నిఛందస్సుల కొకటొకటి విడిచి యీవిధమున సావధానముగా వ్రాయవలెను.

ఇది షట్ప్రత్యయముల లక్షణము.

## లక్షణవృత్తంబులు.

వ. ఇఁక నిర్వదియాఱుఛందములను వివరము. ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి అనునామధేయంబులఛందంబు లిర్వదియాఱై విస్తరిల్లె. అందు మొదటిఛందంబున వృత్తములు ౨, రెండవఛందంబున ౪, మూఁడవచ్ఛందంబున ౮, నాలవచ్ఛందంబున ౧౬, ఐదవ చ్ఛందంబున ౩౨, ఆఱవచ్ఛందమున ౬౪, ఈతీరున నేకోత్తరవృద్ధిగా నిరువదియాఱు ఛందంబుల వృత్తంబులు పదుమూఁడుకోట్లు నలువదిరెండులక్షలు పదునేడువేలు నేడునూట యిరువదియాఱు నుద్భవిల్లి నాల్గేసిపాదంబులుగల్గి యొకయక్షరము మొదలుగఁ గ్రమక్రమంబున నెక్కుడుగణాక్షరంబులు వెలయుచు వేఱువేఱఁ బ్రశస్తంబులై ఛందంబు లనియెడుగనుల వృత్తంబు లనియెడురత్నంబులు పుట్టి విస్తరిల్లె నందుఁ బ్రశస్తంబులై నవిద్యున్మాలయుఁ, జిత్రపదంబును, బ్రమాణియుఁ, గిరకిశోరంబు నుత్సుకంబును, వాగ్మియుఁ, గోమలంబును, శుద్ధవరాటియు, నుపజాతియు, నుపేంద్రవజ్రంబును, శృంగారిణియుఁ, గలరవంబును, నింద్రవజ్రంబును, దోదకంబును, స్వాగతంబును, శ్యేనియు, వాతోర్మియు, భుజంగప్రయాతంబును, దోటకంబును, నింద్రవంశంబును, వంశస్థంబును, ద్రుతవిలంబితంబును, స్రగ్విణియు, జలధరమాలికయు, మత్తమయూరంబును, మంజుభాషిణియు, బంభరగానంబును, లతావృత్తంబును, వసంతతిలకంబును, వనమయూరంబును, బుష్పదామంబును, బ్రహర్షణకలితంబును, సురుచిరంబును, మణిగణనికరంబును, గజరాజంబును, మాలినియు, సుగంధియు, శాంతియు, లలితగతియు, బ్రియకాంతయుఁ, బాలాశదళంబును, బంచచామరంబును, జంద్రభానువును, బృథ్వియు, శిఖరిణియు, మందాక్రాంతంబును, ద్విరితపదగతియు, మత్తకోకిలయు, దేవరాజంబును, శార్దూలవిక్రీడితంబును, గుసుమితలతావేల్లితంబును, దరళియు, భూతిలకంబును, మత్తేభంబును, గలితయుఁ, భుజంగంబును, నుత్పలమాలికయు, నంబురుహంబును, ఖచరప్లుతంబును, సురభూజరాజంబును, స్రగ్ధరయుఁ, గనకలతికయు, మానినియుఁ, జంపకమాలికయు, లాటీవిటంబును, మణిమాలికయు, వనమంజరియు, మాలినియుఁ, గుసుమంబును, మహాస్రగ్ధరయుఁ, దురగంబును, మృగనాభియు, విచికిలస్తబకంబును, బంచశరంబును, శృంగారంబును, నశ్వలలితంబును, గవిరాజవిరాజితంబును, సరసిజమాకళికంబును, గ్రౌంచపదంబును, వనరుహంబును, వసురుచియు, విజయంబును, బంధురంబును, బుధవరసుతంబును, భాస్క-

రవిలసితంబును, జారుమతియును, భుజంగవిజృంభితయు, మంగళమహాశ్రీయు నను నీమొదలుగాఁగల వృత్తంబు లపారంబులై విస్తరిల్లుటం జేసి తదీయలక్షణంబులు వివరించెద. నానందరంగేంద్ర! విన నవధరింపుము. మొదలియుక్తాచ్ఛందంబున నొకయక్షరంబు పాదంబుగా రెండువృత్తంబులు పుట్టె. నందు 96

శ్రీయనువృత్తము (భీమనచ్ఛందమున).—

"శ్రీ
శ్రీఁ
జే
యుఁ." 97

వ. రెండవయత్యుక్తాచ్ఛందమున రెండక్షరములు పాదములఁ గలనాలుగుసమవృత్తంబులు పుట్టె. అందు

శ్రీపెంపు అనువృత్తము (భీమనచ్ఛందమున).—

"శ్రీపెం
పొప్పుఁ
బ్రాపుం
దాపుఁ" 98

వ. మూఁడవమధ్యాచ్ఛందంబున మూఁడక్షరములు పాదములఁ గలసమవృత్తము లెనిమిదిపుట్టె. నందు నాలవదగు

వినయమనువృత్తము (భీమనచ్ఛందమున):—

"వినయం
బునయం
బునయ
జ్ఞానముఁ." 99

వ. నాల్గవప్రతిష్ఠాచ్ఛందంబున నాల్గక్షరములు పాదములఁ గలసమవృత్తములు పదునాఱుపుట్టె. నందేడవ దగు

బింబయనువృత్తము (భీమనచ్ఛందమున) —

"పంబి భకా
రంబు గకా
రం బనఁగా
బింబ మగుఁ." భ. గు. 100

వ. అందు ౬వ దగు

సుకాంతియనువృత్తము (భీమనచ్ఛందమున).—

"జకారముఁ
గకారముఁ
సుకాంతిఁ బ్రకుండు నే." జ. గు. 101

వ. ఐదవసుప్రతిష్ఠాచ్ఛందంబున నైదక్షరములు పాదములఁ గలసమవృత్తంబులు ౩౨ పుట్టె. నందు ౧౬వ దగు

వలమురి యనువృత్తము.—

"నలగపదం
బలవడఁగా
వలమురియా
జలదనిభా" న. లగ. 102

వ. అందు ౭వ దగు

సుందరీవృత్తము (భీమనచ్ఛందమున).—

"చెంది భకారం
బొంది గగంబుల్
సుందరి యఁ జే
రందురు సూరుల్." భ. గగ. 103

వ. ఆఱవగాయత్రీచ్ఛందంబునం దాఱక్షరములు పాదములఁ గలసమవృత్తంబులు ౬౪ పుట్టె. నందు ౧౬వ దగు

విజయశుభ మనువృత్తము (సులక్షణసారమున).—

"నయగుణవృత్తిఁ
నయచరణాప్తిఁ
జయశుభవృత్తం
బె యగుమురారీ!" న. య. 104

వ. అందు ౨౮వ దగు

కిసలయ మనువృత్తము.—

"సస లింపొసఁగఁ
వసుధఁ బదమై
కిసలం బెసఁగుఁ
వసుదేవసుతా!" స. స. 105

వ. ఏడవయుష్ణిక్ఛందంబున నేడక్షరములు పాదములఁ గలసమవృత్తంబులు ౧౨౮ పుట్టె. నందు ౩౨వదగు

ప్రసవవర మనువృత్తము (సులక్షణసారమున).—

“ఎసఁగఁ బదమందుఁ
నసగములు చెందఁ
బ్రసవశర ముర్వీఁ
బిసరుహదళాక్షా!” న. సగ. 106

వ. ఎనిమిదవయనుష్టుప్ఛందంబున నెనిమిదక్షరంబులు పదంబులం గలసమవృత్తంబులు ౨౫౬ పుట్టె. నందు మొదటిదగు

విద్యున్మాలావృత్తము.—

“దేవా మాగా ప్తిఁ విద్యున్మా
లావృత్తం బౌ రంగాధీశా!” మ. మ. గగ. 107

వ. అంద ౫౫వ దగు

చిత్రపదం బనువృత్తము.—

“రాగిలుఁ జిత్రపదంబై
భాగయుగా ప్తత రంగా!” భ. భ. గగ. 108

వ. అంద ౮౬వ దగు

ప్రమాణి యనువృత్తము.—

“ప్రమాణికిం జర ల్గుదఁ
వ మొప్పు రంగపార్థివా!” జ. ర. వగణము. 109

వ. తొమ్మిదవ బృహతీచ్ఛందంబునఁదొమ్మిదక్షరంబులు పాదంబులఁ గల సమవృత్తంబులు ౫౧౨ పుట్టె. నందు ౧౮౩వ దగు

సుత్సుక మనువృత్తము.—

“అంగుగ సుత్సుక మై చనుఁ
రంగనృపా భభరంబులఁ” భ. భ. ర. 110

వ. అంద ౧౮౪వ దగు.

కిశోర మనువృత్తము.—

“సునభరా ప్తి కిశోర మిం
పెనయు రంగమహీపతీ!” న. భ. ర. 111

వ. పదవపంక్తిచ్ఛందంబున పదియక్షరంబులు పాదంబులం గల ౧౦౨౪ సమవృత్తంబులు పుట్టె. నందు నేబదైదవదగు

గోమల మనువృత్తము.—

"భామగురుప్రతిభన్ బెంపొందున్
గోమలవృత్త మనన్ రంగేంద్రా." భ. భ. మ. గ. 112

వ. అంద ౧౯౯వ దగు

వాగ్మి యనువృత్తము.—

"వారక యొప్పున్ వాగ్మికి భంబుల్
ధారుణి రంగేంద్రా మసగంబుల్" భ. మ. సగ. 113

వ. అంద ౩౪౫వ దగు

శుద్ధవిరాటి యనువృత్తము.—

"రంగచ్ఛుద్ధవిరాటికిన్ మసల్
రంగోర్వీప వరా జగంబగున్." మ. స. జ. గ. 114

వ. పదునొకండవత్రిష్టుప్ఛందంబునం బదునొకొండక్షరంబులు పాదంబులం గలిగిన సమవృత్తంబులు ౨౦౪౮ పుట్టె. నందు ౩౫౭ వ దగు

నింద్రవజ్రావృత్తము.—

"ఆనందరంగేంద్ర మహానుభావా
తానింద్రవజ్రం బగుఁ దాజగా ప్తిన్." త. త. జ. గగ. 115

వ. అంద ౩౫౮వ దగు

నుపజాతి (నుపేంద్రవజ్రా)వృత్తము.—

"జత జ్జగల్గం బుపజాతి కొప్పున్
రతీశతుల్యాకృతి! రంగభూపా!" జ. త. జ. గగ. 116

వ. అంద ౪౩౯ వ దగు

తోట(దోద)క మనువృత్తము.—

"జ్ఞావన భత్రయగా ప్తిని రంగో
ర్వీవర తోటకవృత్తము మీఱున్." భ. భ. భ. గగ. 117

వ. అంద ౩౫౮ వ దగు

నుపేంద్రవజ్ర యనువృత్తము.—

"ఉపేంద్రవజ్రం బొనరున్ సిరంగా
ధిపా! జతజ్జద్విగురు ల్చెలంగున్" జ. త. జ. గగ. 118

వ. అంద ౪౪౩ వ దగు

స్వాగత మనువృత్తము.—

"స్వాగతంబు రనభ ల్గగ యుక్తిన్
రాగిలున్ విజయరంగమహీపా!" ర. న. భ. గగ. 119

వ. అందు ౩౦౫ వ దగు

వాతోర్మి యనువృత్తము.—

"దాసత్రాతా మభతంబుల్ లగస్థై
భాసిల్లుఁ రంగప వాతోర్మి కిలఁ." ము. భ. త. లగ. 120

వ. పండ్రెండవజగతీచ్ఛందంబునఁ బండ్రెండక్షరంబులు పాదంబులం గలసమవృత్తంబులు ౪౦౯౬ పుట్టె నందు ౩౬౮ వ దగు

కలరవ మనువృత్తము.—

"కలరవవృత్తము గాంచు నజాయల్
బలయుత రంగనృపాలకచంద్రా!" న. జ. జ. య. 121

వ. అందు ౧౭౫౬ వ దగు

తోటక మనువృత్తము.—

"ససలుఁ ససలుఁ వరుసం గదియఁ
రసఁ దోటకమై తగు రంగనృపా!" స. స. స. స. 122

వ. అందు ౧౧౭౧ వ దగు

స్రగ్విణీ యను వృత్తము.—

"సారె భూభృద్యతిఁ స్రగ్విణీవృత్త మా
రారరల్ గూడినఁ రంగరాయాగ్రణీ!" ర. ర. ర. ర. 123

వ. అందు ౫౮౬ వ దగు

భుజంగప్రయాత మనువృత్తము.—

"యయాయల్ భుజంగప్రయాతాన కిష్టా
నయా నాగవిశ్రాంతి నానందరంగా!" య. య. య. య. 124

వ. అందు ౧౩౮౧ వ దగు

నింద్రవంశ మనువృత్తము.—

"తా నింద్రవంశం బగుఁ దాజరాప్తిచే
నానందరంగా! వడి! యామవైఖరిఁ." త. త. జ. ర. 125

వ. అందు ౧౩౮౨ వ దగు

వంశస్థ మనువృత్తము.—

"సనితి వంశస్థ మగుఁ జతజ్జరల్
పెనంగ రంగోర్విప! షడ్విరామతఁ" జ. త. జ. ర. 126

వ. అందు ౧౪౬౪ వ దగు

ద్రుతవిలంబిత వృత్తము:—

"ద్రుతవిలంబిత రూఢిని రంగభూ
పతి! మరుద్యతిఁ జర్పు నభారలన్." న. భ. భ. ర. 127

వ. అందు ౪౩౯ వ దగు

తోధకవృత్తము.—

"ద్విపయతిఁ దోధకవృత్తము రంగా
ధిపతి నజాయలఁ దేజముఁ జెందున్." న. జ. జ. య. 128

వ. అందు ౨౪౧ వ దగు

జలధరమాలావృత్తం.—

"మారమ్యాస్యా జలధరమాలావృత్తం
బౌ రంగేంద్రా! మభసమ లందంబైనన్." మ. భ. స. మ. 129

వ. పదుమూఁడవదగు నతిజగతీచ్ఛందంబునందుఁ బదుమూఁడక్షరంబులు పాదంబులం గలసమవృత్తంబులు ౮౧౯౨ పుట్టె. నందు ౩౫౨౦ వ దగు

బంభరగాన మనువృత్తము.—

"ప్రజితవిమత బంభరగాన మగున్
గజయతి ననభాగల రంగనృపా!" న. న. భ. భ. గ. 130

వ. అందు ౪౦౪౮ వ దగు

లతావృత్తము.—

"సతవడి రంగేశ్వర నయననగో
న్నతిని లతావృత్తము చెలువమరున్." న. య. నన. గ. 131

వ. అందు ౨౭౯౬ వ దగు

మంజుభాషిణి యనువృత్తము.—

"చను మంజుభాషిణి సజస్సజత్రగా
ప్తిని రంగధీర! నవవిశ్రమోన్నతిన్." స. జ. స. జ. గ. 132

వ. పదునాల్గవశక్వరీచ్ఛందంబునందు పదునాలుగక్షరంబులు పాదంబులం గలసమవృత్తంబులు ౧౬౩౮౪ పుట్టె. నందు ౪౦౯౬ వ దగు

సురుచిర మనువృత్తము.—

"యతి నిధి దునగనన లమరిన రంగ
క్షితిపతిమణి సురుచిర మగు గాప్తిన్." న. న. న. న, గగ. 133

వ. అందు ౨౯౩౩ వ దగు

వసంతతిలకావృత్తము.—

“ధీతత్పరా వసుయతిన్ తభజాగగప్ర
ఖ్యాతిన్ వసంతతిలకం బగు రంగధీరా!” త. భ. జ. జ. గగము. 134

వ. అందు ౩౮౨౩ వ దగు

వనమయూర మనువృత్తము.—

“ఆవనమయూరమన కా భజసనల్గా
ప్రావిరళరత్నయతి రంగమహిపాలా!” భ. జ. స. న. గగ. 135

వ. అందు ౮౧౨౮ వ దగు

ప్రహరణకలిత మనువృత్తము.—

“బలునసభనవల్ ప్రహరణవిలస
త్కలితకుఁ దగు రంగనృప వసుయతిన్.”, న. స. భ. న. వ. 136

వ. పదునైదవ యతిశక్వరీచ్ఛందంబునఁ బదునైదక్షరంబులు పాదంబులం గల సమ
వృత్తంబులు ౩౨౭౬౮ పుట్టె నందు ౧౫౭౮౮ వ దగు

గజరాజ మనువృత్తము.—

“సజభా! సభద్ర విశ్రమ రీతిఁ దనరిన్
గజరాజ మౌను రంగనృపాల వసుమతిన్.” స. జ. భ. భ. స. 137

వ. అందు ౪౬౭౨ వ దగు

మాలినీవృత్తము.—

“ననవిరమణ యుక్తిన్ నామయాసంగతంబై
యవనిఁ దగును మాలిన్యాఖ్యచే రంగధీరా!” న. న. మ. య. య. 138

వ. అందు ౧౬౩౮౪ వ దగు

మణిగణనికర మనువృత్తము.—

“ననలను ననసల నవయతిఁ దగి, రం
గనృపతిమణి మణిగణనికరము నా.” న. న. న. న. స. 139

వ. అందు ౧౦౯౨౩ వ దగు

సుగంధి యనువృత్తము.—

“ఖండవిశ్రమంబునన్ సుగంధి యొప్పి మిన్నగా
నుండు జారజల్ రజల్ రయుక్తి రంగధీమణీ!” ర. జ. ర. జ. ర. 140

వ. అంద ౧౫౩౬౦ వ దగు

లలితగతి యనువృత్తము.—

"నలిని బదునొకటి యతి నానజసలుఙ్

లలితగతి కలరు నిల రంగనృపతీ!" న. న. న. జ. స. 141

వ. పదునాఱవయష్టిచ్ఛందంబునఁ బదునాఱక్షరంబులు పాదంబులంగల ౬౫౫౩౬ సమవృత్తంబులు పుట్టె నందు ౨౧౯౭౭ వ దగు

చంద్రభాను వనువృత్తము.—

"నరజరల్ జగల్ గదించినం దిశావిరామ మై

యరయఁ జంద్రభానువృత్త మాను రంగభూవరా!" న. ర. జ. ర. జ. గ.

వ. అందు ౨౧౯౭౬ వ దగు

పంచచామర మనువృత్తము.—

"క్రమంబునం జరల్జరల్జగంబు గల్గి పంక్తివి

శ్రమాప్తిఁ బొల్చుఁ బంచచామరంబు రంగధీమణీ!" జ. ర. జ. ర. జగ.

వ. అంద ౧౩౨౬౮ వ దగు

ప్రియకాంత యనువృత్తము.—

"నయనయసల్గం బలవడినంతఙ్ బ్రియకాంతా

హ్వాయ మగు నేకాదశయతిరై రంగమహీశా!" న. య. న. య. స. గ.

వ. పదునేడవ యత్యష్టిచ్ఛందంబునందుఁ బదునేడక్షరంబులు పాదంబులఁ గల సమవృత్తంబులు ౧౩౧౦౭౨ పుట్టె నందు ౩౭౪౫౦వ దగు

పృథ్వీవృత్తము.—

"జసల్జసయవంబుతోను జలజాప్తవిశ్రామతఙ్

బొసంగు నిలఁ బృథ్వీవృత్తము సుభోగరంగాధిపా!" జ. స. జ. స. య. వ.

వ. అంద ౫౮౩౩౭ వ దగు

శిఖరిణి యనువృత్తము.—

"యశోభూపాయొప్పుఙ్ యమనసభవప్రాప్తివిద్రయో

దశోద్యద్విశ్రాంతిఙ్ శిఖరిణిలసద్రంగనృపతీ!" య. మ. న. స. భ. వ.

వ. అంద ౧౯౯౨౮ వ దగు

మందాక్రాంత యనువృత్తము.—

"సంతుష్టాత్మా మభనతతగాసమ్మతిం ధాత్రి మందా

క్రాంతం బర్యొఙ్ బదునొకయతిఙ్ రంగభూపాలవర్యా!"

మ. భ. న. త. త. గ. గ. 147

వ. అంద ౩౨౮౬౭ వ దగు

త్వరితపదగతి యనువృత్తము.—

"అయిదునగణములు గగ మమితగుణ రంగేం
ద్ర యతిపదునొకటఁ ద్వరితపదగతి కొప్పుఁ."

న న. న. న. న. గగ. 148

వ. పదునెనిమిదవ దగుధృతి యనుఛందంబునఁ బదునెనిమిదియక్షరంబులు పాదం
బులం గలసమవృత్తంబులు ౨౬౨౧౪౪ పుట్టె నందు ౧౩౧౦౭౨ వ దగు

దేవరాజ మనువృత్తము.—

"క్షితినరల్ నజల్ భసలును జెన్నుగా నభవయతి
స్థితియు దేవరాజమనఁ జెల్లు రంగవరపతీ!" న. ర. న. జ. భ. స. 149

వ. అంద ౯౩౦౧౯ వ దగు

మత్తకోకిల యనువృత్తము.—

"సత్తయారసజాభరల్ భపసంఖ్య విశ్రమ మొప్పినన్
మత్తకోకిలవృత్త మా నసమానరంగనృపాలకా!" ర. స. జ. జ. భ. ర.

వ. అంద ౩౮౭౨౮ వ దగు

కుసుమితలతావేల్లిత యనువృత్తము.—

"శ్రీరంగోర్వీశా మతనయమయముల్ చెంది విశ్రాంతియుక్ వే
శ్వేటన్ మిత్రాప్తిన్ గుసుమితలతావేల్లితావృత్తమయ్యెన్."

మ. త. న. య. య. య. 151

వ. పందొమ్మిదవ యతిధృతిచ్ఛందంబునందుఁ బందొమ్మిదక్షరంబులు పాదంబులం గల
సమవృత్తంబులు ౫౨౪౨౮౮ పుట్టె నందు ౧౪౯౩౩౮వ దగు

శార్దూలవిక్రీడిత యనువృత్తము.—

"సారంబౌ మసజల్సతాగురువులున్ శార్దూలవిక్రీడితం
బారూఢిం బదుమూటఁ గల్గియతిచే నానందరంగాధిపా!"

మ. స. జ. స. త. త. గ. 152

అంద ౧౭౮౦౩౯ వ దగు

భూతిలక మనువృత్తము.—

"సారెకు భారసజాగముల్ పది సారసాప్తవిరామమున్
జేరిన భూతిలకం బగున్ నుతశీల రంగనృపాలకా!"

భ. భ. ర. స. జ. జ. గ. 153

వ. అందు ౧౮౬౦౪౦వ దగు

తరళ యనువృత్తము.—

"తరళ కా నభరస్సజాగయుతంబుగా నినవిశ్రమ
స్ఫురణా రంగనృపాలశేఖర భూరిదానగుణాకరా" న. భ. ర. స. జ. జ. గ.

వ. ఇరువదవ దగుకృతిచ్ఛందంబునం దిరువదక్షరంబులు పాదంబులం గలసమవృత్తంబులు ౧౦౪౮౫౭౬ పుట్టె నందు ౫౨౨౧౭౬వ దగు

కలిత యనువృత్తము.—

"ననభసననవంబుల నలినాప్తవిరమణము రస
ప్రణుత కలితవృత్త మమరు రంగమనుజపతిమణీ"! న. న. భ. స. న. న. వ.

వ. అందు ౨౯౮౬౭౬వ దగు

మత్తేభవిక్రీడితావృత్తము.—

"నలువొందన్ సభరల్ నమ ల్యవలతో సంగూడి మత్తేభ మిం
పలరారున్ బదునాలుగౌ విరతిచే నానందరంగాధిపా!"
స. భ. ర. న. మ. య. వ. 156

వ. అందు ౩౫౫౭౯౯వ దగు

నుత్పలమాలికావృత్తము —

"పన్నిపదాయతిన్ భరనభారవసంజ్ఞగణాళిఁ గూడి య
త్యున్నతవృత్తితో వెలయు నుత్పలమాలిక రంగధీమణీ!"
భ. ర. న. భ. భ. ర. వ. 157

వ. అందు ౩౭౨౨౧౬వ దగు

భుజగ మనువృత్తము.—

"మను నభల్ నభరసవముల్ పదుమూఁట విశ్రమ మొప్పినన్
ఘనవజారతవిజయరంగశిఖామణీ భుజగం బగున్. న." భ. న. భ. ర. స. వ.

వ. అందు ౩౭౨౧౫౧వ దగు

నంబురుహ మనువృత్తము:—

"నాలుగుభంబులపై రసవంబులు వల్వ్యాగాఁ బదమూఁట నిం
పొలి విరామము నంబురుహాంబున కొప్పు రంగమహీపతీ!"

భ. భ. భ. భ. ర. స. వ. 159

వ. ఇరువదియొకటవ దగుప్రకృతిచ్ఛందంబునం దిరువదియొకండక్షరంబులు పాదంబులం గలసమవృత్తంబులు ౨౦౯౭౧౫౨ పుట్టె నందు ౭౮౬౧౦౪వదగు

సురభూజరాజ మనువృత్తము.—

"రవియతిఁ జెలఁగన్ సురభూజరాజము ప్రబలు నభరనసారలఁ
దవిలి రంగమహీతలాధిప! దళితవిమతనృపాలకా!" న. భ. ర. న. న. స. ర.

వ. అందు ౭౧౧౬౦౦వ దగు

చంపకమాలిక యనువృత్తము.—

"సలలితరీతితో నజభజాజరసంజ్ఞగణాళిఁ జంపకం
బలవడ భద్రవిక్రమసమంచితహైతగురంగభూవరా!"

న. జ. భ. జ. జ. జ. ర. 161

వ. అందు ౩౦౨౯౯౩వ దగు

స్రగ్ధర యనువృత్తము.—

"సారెన్ నాగాధిరాట్పంచదళవిరమతిన్ స్రగ్ధరావృత్త మొప్పుంగాం
తారాజీవాస్త్రయుద్యన్మరభనయయయోద్భాసియై రంగభూపా!"

మ. ర. భ. న. య. య. య. 162

వ. అందు ౭౪౪౩౦౪వ దగు

వనమంజరి యనువృత్తము.—

"నగణముపై జజజాభరలున్ పమనాల్గిటన్ విరమంబునున్
దగి చెలఁగున్ వనమంజరివృత్తము ధాత్రి రంగనృపాలకా!"

న. జ. జ. జ. జ. భ. ర. 163

వ. ఇరువదిరెండవ దగు నాకృతిచ్ఛందంబునం దిరువదిరెండక్షరంబులు పాదంబులం గలవృత్తంబులు ౪౧౯౪౩౦౪ పుట్టె నందు ౧౭౯౭౫౫౯వ దగు

మానిని యనువృత్తము.—

"ఏడిటవల్లు మహిన్ బదుమూఁడిట యొక్కటమూతక్కువయిర్వదిటన్
కూడిన మానిని కొప్పును శైలభగుర్వులు రంగప! గూఢముగాన్."

భ. భ. భ. భ. భ. భ. భ. గురు. 164

వ. అందు ౨౦౯౭౧౫౨వ దగు

కనకలతిక యనువృత్తము:—

"దనర నిసల కవలివడి సతనగణములు గురువు రం
గనృపతిమణి వితరణగుణి కనకలతిక కను దగున్."

న. న. న. న. న. న. న. గ. 165

వ. అందు ౨౦౭౧౫౨౦వ దగు

మహాస్రగ్ధర యనువృత్తము:—

"రహిం ఖండగ్లౌకళావిశ్రమములను మహాస్రగ్ధరావృత్త మా శ్రీ
సహితౌదార్యా సతానల్ సరరగురువు లుంచంగ శ్రీరంగభూపా!"

స. త. త. న. స. ర. ర. గ. 120

వ. అందు ౧౪౬౯౪౪౪వ దగు

తురగ మనువృత్తము:—

"ఇలను దురగము నెనిమిదిటఁ బదునేనిటఁ యతు లొప్పఁగా
నలరు నలునగణములు సజజగలంది రంగమహీపతీ!"

న. న. న. న. స. జ. జ. గ. 121

వ. ఇరువదిమూఁడవవికృతిచ్ఛందంబునం దిరువదిమూఁడక్షరంబులు పాదంబులఁ గల
వృత్తంబులు ౮౩౮౮౬౦౮ పుట్టె నందు ౪౧౯౪౩౦౪ వ దగు

కుసుమ మనువృత్తము:—

"నభనభ త్రిగనగణము ల్వగణయుతమయి చెలు వలరినఁ
విభుఁడు రంగనృపతి! త్రయోదశవిరతి వసుమతిఁ గుసుమమా."

న. భ. న. భ. న. న. న. వ. 122

వ. అందు ౩౪౯౭౧౨౧వ దగు

కవిరాజవిరాజిత మనువృత్తము:—

"నగణము షడ్జగణంబులపై వగణంబుఁ ద్రయోదశవిశ్రమముం
దగఁ గవిరాజవిరాజితవృత్త మనంజను రంగనృపాలమణీ!"

న. జ. జ. జ. జ. జ. జ. వ. 123

వ. ఇరువదినాల్గవ దగుసంకృతిచ్ఛందంబునం దిరువదినాలుగక్షరంబులు పాదంబులం
గలసమవృత్తంబులు ౧౬౭౭౭౨౧౬ పుట్టె నందు ౪౮౫౭౪౩౩ వ దగు

పంచశర మనువృత్తము:—

"మించినరుద్రప్రౌఢిని బందొమ్మిదిటను యతి తగి మెఱసినయంతఁ
బంచశరం బా రంగనృపాలప్రభుతిలక! భమసభననయా ప్తిఁ."

భ. మ. స. భ. న. న. న. య. 124

వ. అందు ౪౧౯౩౩౮౦వ దగు

శృంగార మనువృత్తము:—

"మృడవిశ్రామం బవలఁ బందొమ్మిదిటను యతి తగి మెఱసినయంతఁ
గడు శృంగారాఖ్యం జెలంగుఁ రంగనృపతి! సతయభనననయయుక్తిన్."

స. త. య. భ. న. న. న. య. 125

వ. ఇరువదియైదవ దగు నతికృతిచ్ఛందంబునం దిరువదియైదక్షరంబులు పాదంబులం గల సమవృత్తంబులు ౩౩౫౫౪౪౩౨ పుట్టె నందు ౧౬౭౭౬౬౦౧వ దగు

వనరుహా మనువృత్తము:—

"రుద్రప్రౌఢిని బందొమ్మిదిటఁ రుజ లగుయతు లొనరుట వనరుహా ఖ్యై
భద్రశ్రీయుత! రంగాధిపతీ! పరగులిపుల మసభభననననగల్."

మ. స. భ. భ. న. న. న. న. గ. 126

వ. అందు ౪౧౭౯౯౦౪వ దగు

సురుచి యనువృత్తము:—

"వసుమనువుల నిర్వదియొకటఁ జెల్వై విరమణములు వఱలం బాగా
నసమనురుచి శ్రీహరిసమ రంగేంద్రా! ననభసతననయగప్రాప్తిఁ."

న. న. భ. స. త. న. న. య. గ. 127

వ. అందు ౧౬౬౪౪౫౧౧వ దగు

విజయ మనువృత్తము:—

"భానులఁ బదియుం దొమ్మిదిటఁ జొప్పడి విరతులు నేర్పడ విజయ మగుఁ
సైనికయుతరంగాధిపసల్లాణు భసభతనల్ సననగములతోఁ."

భ. స. భ. త. న. స. న. న. గ. 128

వ. అందు ౮౩౮౧౩౧౧వ దగు

భాస్కరవిలసిత మనువృత్తము:—

"మానితసుగుణ త్రయోదశవిశ్రామంబున భనజయభననసగాప్తిఁ
భానుసదృశరుచిరంగనృపాలా భాస్కరవిలసిత మగునిలలోనఁ."

భ. న. జ. య. భ. న. న. స. గ. 129

వ. అందు ౧౫౬౫౮౭౩౫వది యగు

చారుమతి యనువృత్తము:—

"చారుమతి యొప్పును భజల్ సనభజల్ సనగ
సంగతి కవీంద్రవినుతా!
సారెకుఁ ద్రయోదశకసప్తదశసద్యతి ల
సద్గతిని రంగనృపతీ!"

భ. జ. స. న. భ. జ. స. న. గ. 130

వ. ఇరువదియాఱవ దగు సంస్కృతిచ్ఛందంబునం దిరువదియాఱక్షరంబులు పాదంబులం గలసమవృత్తంబులు ౬౭౧౦౮౮౬౪ పుట్టె నందు ౧౫౬౫౮౭౩౫వ దగు

మంగళమహాశ్రీ యనువృత్తము:—

"సత్తుగనురత్నమాల సప్తదశమంబునను
సద్యతులు మంగళమహాశ్రీ
వృత్తమున కౌ భజసనత్రిభజల్సనల
పై గురులు రంగనృపధీరా!"

భ. జ. స. న. భ. జ. స. న. గ. గ. 131

ఇవ్విధంబున నుక్తాదియిరువదియాఱుచ్ఛందంబుల నుద్భవిల్లినవృత్తంబు లందు నూతనపురాతనవృత్తంబులు కొన్ని పూర్వకవిప్రయోగసరణి వివరించినాఁడ, నింక నం దుద్ధరమాలావృత్తంబులు స్వస్థానపరస్థానవృత్తంబులు మొదలుగాఁ గలవృత్తభేదంబులు వివరించెద.

క. ధర రంగధీమణీ! యీయిరువదియాఱక్షరముల కెక్కుడు లైయు
ద్ధరమాలావృత్తము లని, పరగు లయగ్రాహి లయవిభాతియుఁ గృతులన్. 132

లయగ్రాహివృత్తము:—

"ఎన్నె వెలయున్ భజసనమ్ములు మఱిన్ భజస
నమ్ములపయిన్ భయగణమ్ములు లయగ్రా
హి న్నెఱయు రంగనృప! యిమ్మహిని ప్రాసయుతు
ల న్నెఱిని నాల్గుచరణమ్ములను వేడ్కన్."

భ. జ. స. న. భ. జ. స. న. భ. య. 133

లయవిభాతి:—

"నగణము సనమ్ములును నగణము సనమ్ములును
నగణము సనమ్ములును నగణము సగంబుల్
జగతిఁ గృతులందు వెలయఁగ లయవిభాతి యనఁ
దగు విజయరంగనృప! యగణితగుణాఢ్యా!"
న. స. న. న. స. న. న. స. న. న. స. గ. 134

వ. మఱియు లయవిహారి, తరవోజ, త్రిభంగి మొదలగునవి యనేకవిధోపరివృత్తంబులుంగలవు. వెండియు దండకవృత్తంబులు దశవిధంబులుగల వవి చండవృష్టి, అర్ణ, అర్ణవ, వ్యాళ, జీమూత, లీలాకర, ఉద్దామ, శంఖ, తగణ, యగణ దండకంబులు ప్రశస్తంబులై విస్తరిల్లు నందు మొదటి చండవృష్టిదండకంబునకు ౨౭ అక్షరంబు లొప్పు నది యెట్టులనిన.

"నగణయుగమామీఁద రేఫావళుల్ మానిసం
ఖ్యన్ దగన్ జండవృష్ట్యా మహిన్ భూధవా!"
న. న. ర. ర. ర. ర. ర. ర. ర. 135

క్రమంబున [1]నర్ణాదిదండకములకు నొక్కొక్కరగణ మెక్కువగా నొప్పుచుండును.

భీమనచ్ఛందంబున:—

"అమరఁగ ననహంబు లందాదిగా నొండె కాదేని నాదిం దకారంబుగా నొండెలోనం దకారంబు లిమ్మై గకారావసానంబుగాఁ జెప్పినన్ దండకం బండ్రు దీనిం గవీంద్రుల్ జగద్గీతకీర్తీ! పురారాతిమూర్తీ! సదాచారవర్తీ! వణిగ్వంశచూడామణీ! బంధుచింతామణీ! రేచనా! కావ్యసంసూచనా! దానవైరోచనా!"

అనియున్న దిగనుకఁ బురాతనకవులు తగణప్రధానముగానే దండకములు రచియించినారు గనుక నాలాగునను జెప్పవచ్చును.

రగడలు:—

రగడలుతొమ్మిదివిధములు. హయప్రచారము, తురగవల్గనము, విజయమంగళము, ద్విరదగతి, విజయభద్ర, మధురగతి, హరిగతి, హరిణగతి, వృషభగతి అని. అందు హరిగతి యనురగడకు ఆటతాళము; హయప్రచారము, తురగవల్గనము, విజయమంగళము వీనికి రూపకతాళము; మధురగతి యనురగడకు నేకతాళము; ద్విరదగతి,

1 నార్ణాది.

విజయభద్ర. వీనికి జంపెతాళము; గరం హారిణగతి, వృషభగతులకుఁ ద్రిపుటతాళము. ఇట్లు నవవిధంబు లైనరగడలు తాళభేదంబులు జెలఁగుచు నుదాహరణంబులకు నాకరంబై యుండు. ఆయుదాహరణములు గ్రిసరాయజ్ఞవలి మొదలయినవి పెక్కులుగలవు.

భీమనగారు సప్తవిభక్తులు ... గూడ నెనిమిదివిభక్తులను వరుసగాఁ గృతినాయకాంకితపద్యంబులు ... గోమదీశాన ... ంచి రగడజాతి సాలిగా ... దళంబులతోఁ గడ లిక యనక వివరించి యందు ... బుత్కలికగా నేర్పరిచి యే దేసిపదమ్ము లేక సమాసరీతి విభక్త్యర్థమ్ము ... చెప్పి వానికి సరిగా నెనిమిదవదళంబుఁ గూర్చి కడను బద్యం బొకటి సర్వవిభక్త్యర్థకంబుగాఁ జెప్పవలయుననియు నట్లుకాదేని యన్నియుత్కళికలకు విభక్త్యాభాసంబుగాఁ జెప్పి షష్ఠ్యుత్కళికకేనియుఁ జతు ర్థ్యర్థ ... బొసఁగునట్లు రచియింపవలయునని చెప్పినారు. ఈవిభక్తుల కధిదేవతలు. ప్రథమకువీరావళి; ద్వితీయకుఁగీర్తిమతి; తృతీయకుసుభగ; చతుర్థికి భోగమాలిని; పంచమికిఁ గళావతి; షష్ఠికి గాంతిమతి; సప్తమికిఁ గమల; సంబోధనకును జయపతి. అను నీపేరులు గలుగఁ జెప్పినఁ దద్దేవతలు సకలశుభంబులొసంగుదురు. ఇవ్విధంబునం బలుక నది యుదాహరణం బనందగును.

మఱియు వసంతనపథ్యార్యా, విపులార్యా, చపలార్యా, ముఖచపలార్యా, జఘనచపలార్యా అని యైదువిధంబుల యార్యావృత్తంబులును; మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అల్పాక్కర, అంతరాక్కర అనియక్కరజాతివృత్తంబులు ౫ తెఱంగులును; గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనము, విన్నపములు నని ౫ విధములు గద్యలును, ఆటవెలఁది, తేటగీతి, పవడగీతి, మలయాగీతి, ఉపగీతి, ఉద్గీతి, యార్యాగీతి యని ౭ విధంబులగీతంబులును; వృత్తప్రాసనీసము, సర్వతఃప్రాససీసము, అర్థసమసీసము, అవకలిసమసీసము, అవకలినడిసీసము, అవకలిప్రాససీసము, సర్వలఘుసీసము, ఉత్సాహవేదండసీసము, విషమసీసము, సమనామప్రాససీసము, గీతరహితచతుష్ప్రాససీసము, సర్వవడిసీసము అని ౧౨ విధములసీసపద్యములును; సమకందము, విషమకందము, ఆర్యాకందము, రుచకందము, నిడుదకందము, ద్వివిధకందము, చతుర్విధకందము, వృత్తగర్భితకందము, ప్రమితాక్షరకందము నన ౯ విధంబులకందపద్యములును; పంచరత్నంబులు, దిగ్గజంబులు, నవరత్నంబులు, కళావళి, తారావళి, విద్యావళి, శతకము, వృత్తమాలిక, కందమాలిక, సీసమాలిక, యక్షగానము, నాటకము, కీర్తనలును, పదములు, సూళాదితాళకొ(క)ట్నములు, ధవళములు, శోభనములు, ఉరుటణులు, ఆరతిపాటలు, జోలలు, అష్టకములు, ఏలలు, గొబ్బిళ్లు, చందమామపదములు మొదలుగాఁగల బహువిధగతుల నతుల ప్రభావంబుల గంగాప్రవాహంబులై విస్తరిల్లు. మఱియుఁ బద్యభ్రమక, పాదభ్రమ

బోధబంధుర ధీయుగంధర భూధురంధరసింధురా
సాధువిగ్రహ భీమవిగ్రహ శాత్రవాగ్రహనిగ్రహా!

మ. హరిసద్విక్రమచంద్రచేలవిధుభక్తాగ్రేసరాయబ్జసుం
దరపాణిద్వయసోమభూతిముతసన్నాథాసు(సు)జైవాతృకా
యరిహారాజకళానిధీ కుముదమిత్రాగోమదీశాన్వయా
హరిణాంకస్ఫుటబింబసన్నిభముఖా యానందరంగాధిపా!

క. ఘనవనంద సంతతిపయో,వననిధిరాకాశశాంక వాసవవిభవా
వనితాజనతా నూతన, మనసిజయానందరంగమహీపతిచంద్రా!

141

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షల
కులజలధికుముదమిత్ర వేంకటకృష్ణార్యపుత్త్ర శ్రీ[illegible] ధర్మవెచ్చ
మిత్ర కుకవిజనతాలవిత్రి యార్వేలకమ్మనియోగికు[illegible]త్ర విద్వజ్జన
ధేయప్రణీతంబైన యానందరంగచ్ఛందం బను [illegible]వి కస్తురిరంగనామ
బును జతుర్థాశ్వాసము. [illegible]మణియందు సర్వం

ఆనందరంగరాట్ఛందవ

[illegible]ర్ణము.

# తప్పొప్పులపట్టిక.

---

| పేజీ. | పద్యము. | బంతి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|---|
| 4 | 18 | 3 | సందటితో | సందటిలో |
| 6 | 31 | 4 | సాన్నిధ్యమై | సాన్నిధ్యమై |
| | 36 | 8 | కళాధరుఁ | కళాధరుఁ |
| 8 | 46 | 1 | చర్య | చతుర |
| | ,, | ,, | దాత | ధాత |
| | ,, | 2 | నెదురు | నెదిరి |
| | 51 | 1 | చంద్రుఁడై | చంద్రుఁడై |
| 10 | 55 | 6 | జంత్రాలు | జన్రులు |
| | ,, | 11 | సాఁటి | సాటి |
| | 62 | 4 | చలివెందర | చలిపదిపు |
| 11 | 64 | 2 | గతిగృష్ణ | గతిఁలక్ష్ణ |
| | 66 | 3 | చక్కదనము | ఁజకఁదనము |
| | 67 | 3 | గల్వ | ఎ |
| | 68 | 3 | గాంచగా | గాంచఁగా |
| 13 | 77 | 2 | ఁదారి | ఎ క |
| 13 | 79 | 1 | చెల్వొందు | ఁజెల్వొందు |
| 14 | 89 | 7 | కటక | [illegible] |
| | 90 | 1 | సరిగ్ర | సరిగ |
| 15 | 94 | 5 | ంహాసనమును | దిండుఁజేరి |
| | 96 | 2 | ద్రాంతు | సింహాసనముఁ |
| 18 | 109 | | బులుకో | ద్రాంత |
| | | 2 | వడసి | బులుఁగో. |
| 19 | 122 | 4 | పుత్రికలకు | వడని |
| 20 | 49 | 1 | జ్ఞేయాః | పుత్త్రికలకు |
| | | | | జ్ఞేయ...క్షిప్ర |

| పేజీ. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 39 | 55 | 3 | వార | తార |
| | 57 | 2 | కారయితా | కారయితు |
| 40 | 72 | 2 | బురువై | బురువా |
| 41 | 79 | 1 | బోనాడుదురో | బోనాడుదురా |
| | 82 | 1 | కురణా | కురూణా |
| 43 | 102 | 2 | వేదినః | వేధినః |
| | 104 | 1 | వ్యాస్తంబై | వాస్తంబై |
| 45 | 119 | 1 | వర్ణములకు | వర్ణములకుఁ |
| 46 | 124 | 2 | నేనాని | సేనాని |
| | | 7 | లాగు | లాకు |
| | 126 | 2 | కసమవు | కసమపు |
| | 27 | 2 | యితులు | దయితులు |
| 47 | 131 | 2 | సనము | సవము |
| | | ,, | సనని | నవలి |
| 49 | 144 | 2 | గను | గనుక |
| 51 | 165 తర్వాత | 1 | కవిసరిర్వ | కవిసర్వ |
| | 166 | 1 | గీస్తుత్యా | గీస్తున్నత్యా |
| 52 | 1[illegible]3 | 3 | లొప్పు | లొప్పుఁ |
| | ,, | 4 | చొప్పన | చొప్పునఁ |
| 53 | 175 | 4 | నిడ | నిడుఁ |
| | 177 | | దాఁగృతి | దాకృతి |
| | 180 | 2 | కప్రదు | కెళ్లదు |
| 54 | 186 | 2 | [illegible]మర | కమరు |
| | ,, తా | 4 | [illegible]డు | మూఁడు |
| 55 | 194 | 1 | గజా[illegible] | గజానాం |
| 56 | 200 | 2 | గొట్టెయ...[illegible]డే | గోత్రీయ...గూడె |
| 57 | 209 | 4 | ఘటా | ఘటు |
| 61 | 233 | 2 | డగు | దగు |
| | 237 | 2 | విడఁగా | లిడఁగా |
| 62 | 241 | 3 | బెటు | బెంట్లు |

| పేజీ. | పద్యము. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 63 | 248 | 2 | క్రియమ్ | శ్రియమ్ |
| 65 | 258 | 2 | మెసగు | మెసఁగు |
| 68 | 269 | 7 | కేశ | కేశవ |
| | 270 | 4 | విప్రలకు | విప్రకుల |
| | 272 | 2 | ఖైక్షవం | భైక్షవం |
| 69 | 275 | 1 | వారితావి | వారితాబ్ధి |
| 70 | 280 | 1 | కౌబామ్ | శాబామి |
| 73 | 6 | 3 | పభబభల్ | పఫబభల్ |
| | | 4 | పవర్గు | బవర్గు |
| 73 | 8 | 2 | ముణ్ | ముల్ |
| 74 | 11 | 7 | ఘుజ్ | ఘుఞ్ |
| 77 | 25 | 2 | తగుఁ | తగఁ |
| | 27 | 1 | కొమ్మొ | కొమ్మ |
| 81 | 56 | 1 | దనుపట్టు | గనుపట్టు |
| 82 | 62 | 2 | కలఁతిగ | కలతిగ |
| 84 | 77 | 2 | లగు, ప్రథమ | లగుఁ, బ్రథమ |
| 85 | 89 ముందు | 1 | అనుశాసటిక | అనుశాసనిక |
| | | | (అంతట నిట్లే సవరించుకొనునది) | |
| 87 | 105 | 2 | శ్లేశ | క్లేశ |
| | 106 | 1 | చి, ట్లేసియు | బి, ట్లేసియు |
| | | 3 | చిందఱవందఱగుఁగాఁగ | చిందఱవందఱగాఁగ |
| 89 | 117 | 1 | రాజులఁ | రాజుల |
| 91 | 130 | 1 | వినంగా | వినఁగా |
| 94 | 158 | 1 | నిషివిమ | మనీషివి |
| 96 | 180 | 1 | దేశ్య | దేశి |
| | 181 | 2 | బ్బరపు | బ్బురపు |
| 98 | 193 | 1 | వలిసఁ | వలిఁ |
| | 194 | 2 | వాగ్ఝురుఁ | వాగ్ఘురుఁ |
| 103 | 239 తా | 1 | క్షుబ్ద | క్షుబ్ధ |
| 106 | 261 | 3 | మాప్పిఁ | మూష్టిఁ |
| 10 | 294 | 2 | మర్థింపంగ | మర్దింపంగ |

| పేజీ. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 111 | 302 | 1 | జ్ఞాయ | జ్ఞాన |
| | 308 | 2 | య్యాను | యాను |
| 113 | 324 తా | 2 | జ్ | అజ్ |
| 117 | 357 | 2 | మేనుగఁ | మేనునఁ |
| 125 | 41 | 1 | జరిప | జరిత |
| | | ,, | బరగు | పరగు |
| | | 2 | జైవులకు | జైవ్యలకుఁ |
| 127 | 54 | 3 | గాన | గావ |
| | 56 | 3 | పాటి | సాటి |
| | 59 | 1 | వచ | నీచ |
| 127 | 61 | 1 | సురలు | నరలు |
| 128 | 70 | 1 | మెకట | లోకట |
| 131 | 89 | 1 | బండి | బంతి |
| | 91 | 1 | వ్రాసిఁ | వాసిఁ |
| | | 2 | లబ్దా | లబ్ధా |
| 132 | 94 | 3 | విడుచు | లిడుచు |
| | 95 | 2 | మాత్రలనో | మాత్రనయో |
| | ,, | 4 | నాలుగన | నాలుగవ |
| | 95 తా | 3 | 32 | 3౨ |
| | | 4 | యింటి | యింట |
| 136 | 106 ముందు | 1 | ప్రసవపర | ప్రసవశర |
| 148 | 135 | 2 | జండస్పృష్ట్వా | జండస్పృష్టో |
| 149 | | 2 | ఖేదంబులు | ఖేదంబులఁ |
| | | 12 | పక్షికి | పక్షికిఁ |

144 వ పేజీలో 164వ పద్యానంతరమునఁ దర్వాత పద్యసంఖ్య మాఱినవి.

---

